# ముగ్ధ ప్రణయం



రచన:

ఐ. యస్. తుర్గెనీవ్





నవోదయ పబ్లిషర్సు
విజయవాడ-2

# ముగ్ధ ప్రణయం

అనువాదం :

సిరిమూర్తి

కృష్ణాజిల్లా పెనమలూరు గ్రామస్తులు
చిగురుపాటి బుచ్చిరామయ్య గారు
డా॥ చంద్రశేఖర్ గారు
బహూకరించిన పుస్తకం

# ముగ్ధప్రణయం

నే చెప్పబోయేది ఓ పురాణ గాథ. నా కప్పటికి పాతికేళ్ళు వుంటాయి. అప్పుడే పెద్దవాళ్ళ అజమాయిషీలోంచి బైటపడి విదేశయాత్రకి బయలుదేరాను-పై చదువులు చదివి రావడానికి కాదులేండి-ఓసారి అలా ఈ విశాలమైన విశ్వమంతా చూసివద్దామని. మంచి ఆరోగ్యం-యుక్తవయస్సు-ఉరకలు వేసే ఉత్సాహం-వీటన్నిటికీ తోడు కొదవలేనిడబ్బు-! బాధ్యతలేం ఇంకా నెత్తిన పెట్టుకోలేదు. అందుకని కావలసినంత స్వేచ్ఛ-మన యిష్టమే యిష్టం. నా జీవితానికదే వసంతకాలం. మనిషి మానుకాదు-అతని వసంతకాలం అతి చిన్నది అని అప్పటికింకా నాకు అవగతం కాలేదు...సరే- ఇప్పుడీ విషయం అప్రస్తుతం.

ఒక వరసా వాయీ లేకుండా ఓ గమ్యం ఉద్దేశం లేకుండా ప్రయాణం చేశాను. నా యిష్టంవచ్చినచోట ఆగేవాణ్ణి. మళ్ళీ కొత్తమొహాలు చూడాలనిపించగానే బయల్దేరేవాణ్ణి. అవ్వే నాక్కావలసింది-కొత్త మొహాలు! కోటలు,

గోడలు, అగడ్తలు, ప్రసిద్ధ పురాతన శిల్పాలు-ఇవన్నీ నా కసహ్యం. నా కుతూహలాన్ని రేకెత్తించేది మానవులొక్కరే! ప్రకృతి ప్రభావంనామీద చాలా వుంది. కాని, కొండలు-గుహలు అడవులు-సెలయేళ్ళు-జలపాతాలు-ఈబాపతుప్రకృతిసౌందర్యం అంటేనా కేంపట్టదు. కాని, ముఖాలు-కళకళ్లాడేమనుషుల ముఖాలువారి మాటలు-కదలికలు - నవ్వులు - ఆటలు - పాటలు-ఇవ్వి లేకుండామటుకు నేనుండలేను. నేనెప్పుడూ నలుగురితో కలసి వుండాలి - వాళ్ళతోబాటు చప్పట్లు తాళాలు కొట్టాలి - కొడుతూనే మిగతా అందరూ ఎలా కొడుతున్నారో చూడాలి. ఇదే నా ముఖ్య వినోదం. చూడటమంటే వృత్తినే కాదు-అదోరకమైన ఉల్లాసంతో-తీరని కుతూహలంతో పరీక్షగా పరిశీలిస్తాను...అరె-మళ్ళీ అసలు కథ వదిలేసినట్టున్నాను-

సరే అప్పుడు-ఇరవై యేళ్ళక్రితం రైన్‌నది ఎడమతీరాన 'జ...' అనే చిన్న జర్మన్ పట్నంలో కొన్నాళ్ళు మకాం చేశాను. అంతకుముందే ఒకానొక వితంతు యువతితోటి ప్రేమకలాపంలో దెబ్బతిని విరక్తితో ఏకాంతంకోసం వెదుకులాడుతూ ఆవూరు చేరాను. ఆవిడమటుకు భలే అందమైంది. చాలా తెలివిగలదికూడానూ. వాడూ వీడూ అని లేకుండా ప్రతివాడితోనూ సరసాలాడేది. నాకూ ముందు హుషారిచ్చినట్టే యిచ్చి ఓనాడు హఠాత్తుగా ఒక బూరెబుగ్గల బవేరియన్ లెఫ్టినంట్‌ని చేరదీసి నన్ను క్రూరంగా గాయపరచింది. మనలో మాటగా చెప్పాలంటే నా హృదయానికా నాడు తగిలిన గాయం ఏమంత పెద్దది కాదనుకోండి...ఏమైనా కొన్నాళ్ళ

కాటు ఏకాంతంలో పరితపిస్తూ గడపాలనుకొని 'జ...'కుజేరాను. ఆ వూరుకూడా నాకు నచ్చింది. రెండు పక్కలా రెండు ఎత్తైన కొండలు - మరపురాని నిమ్మతోటలు - రైన్‌నది ఉపనదిమీద ఎత్తుగావున్న బ్రిడ్జి-వూరినిండావున్న ద్రాక్షసారా - అన్నీ కూడా నన్నాకర్షించినాయి. సూర్యాస్తమయం అయ్యీ అవకముందే అద్భుతమైన జర్మన్ సుందరాంగులు ఆ యిరుకు వీధుల్లో నడయాడుతూ విదేశీయుల్ని కూడా 'గు టెన్ ఎ బెన్డ్' అని అదోరకం తమాషా ఉఛ్ఛారణతో పలకరించేవారు. వాళ్ళల్లో చాలా మంది చంద్రోదయం ఐన తర్వాతకూడా షికారుచేస్తూనే వుండేవారు. అసుగో-అలాంటి సమయంలో ఆ వీధులంట తిరగడమంటే మహా సరదాగా వుండేది నాకు. స్వచ్ఛమైన ఆకాశంలోంచి చంద్రుడు సూటిగా ఆవూరు చూస్తున్నట్లుంది. వూరు కూడా ఆ వెన్నెల ముసుగులో వెలిగిపోతూ ప్రశాంతంగా కనిపిస్తోంది. కాని ఆ వెన్నెల ఎంతనిరుపమంగా నిరుద్రిక్తంగా కనిపిస్తున్నా లోలోపల ఎంత గంద్రగోళ పెడుతూ వుంటుందో వేరే చెప్పనక్కర్లేదు. ఇళ్ళ చూరులకింద కిటికీల్లోంచి సన్నని కొవ్వొవత్తులు నునుసిగ్గుతో మినుకుమినుకు మంటున్నాయి. రాతిగోడల వెనకనుంచి ద్రాక్షతీగెల కొనలు మెలికలు తిరిగి పోతూ ఆలంబనకోసం అల్లల్లాడిపోతున్నాయి. కమ్మని నిమ్మ తావుల్ని మోసుకొస్తూ ముఖాల్ని స్పృశించి ముంగురుల్ని సరిదిద్దిపోతున్న చల్లని తెమ్మెరలను కాస్తకూడా బీరుపోకుండా ఆవురావురమని పీలుస్తున్నారు మనుషులు.

'జ...' పట్నం రైన్‌నదికి ఒకటి రెండుమైళ్ళ దూరాన వుంది. చాలాసార్లు ఆవది వొడ్డుకుపోయి బ్రహ్మాండమైన అశోకవృక్షంకింద రాతిబల్లమీద కూర్చుని ఆ మహానదివంకే చూస్తూ కూర్చునేవాణ్ణి ఆ చపలచిత్తురాలైన విధవను గురించి ఆలోచిస్తూ. చెట్టుమీద కొమ్మమధ్య ఆకుల సందున అణిగి మణిగివున్న 'మడోనా' విగ్రహం ఎందుకో ఎప్పుడూ మంద హాసం చేస్తూండేది. నదికి అవతల వొడ్డున 'ల...' అని పట్నం వుంది. నేనున్న వూరికంటే అదికాస్త పెద్దదేనట. ఓరోజు సాయంత్రం నా మామూలు బెంచీమీద నది-ఆకాశం-ద్రాక్ష తోటలు-ఒకదాని తర్వాత మరోదానివంక చూస్తూ కూర్చు న్నాను. కొందరు పిల్లకాయలు తారుపూసిన బోటొకటి ఒడ్డుకు లాగుతున్నారు. వొదులుగా అటుయిటూ కొట్టుకుంటున్న తెర చాపలతో ఓడలు ఏటివాలున జారిపోతున్నాయి. ఉన్నట్టుండి నా చెవులకు సంగీత ధ్వనులేవో వినిపించాయి. చెవులు రిక్కించి విన్నాను. 'ల...' పట్నంలో ఏదో వాల్ట్జ వాయిస్తున్నారు. లయాను గుణ్యంగా మధ్యమధ్య డబుల్‌బాస్ భమ్మంటోంది- ఏదో అస్పష్ట మధుర రాగాన్ని గుమ్మరిస్తోంది వయొలిన్- ఉల్లాసంగా ఈలవేస్తోంది మురళి.

"ఏమిటది?" అని అప్పుడే నాపైపోస్తున్న ఒక ముసల తన్ని అడిగాను.

అతను నోట్లో ఓ పక్కన పెట్టిన పైపు తీసి మరోపక్క పెట్టి అన్నాడు-

"అదా ? వాళ్ళంతా 'బ...' పట్నం నుంచి కోమర్స్ కోసం వచ్చిన విద్యార్థులు !"

ఈ కోమర్స్ ఏమిటో చూడాలి. ఏటవతల మన మెప్పుడూ వెళ్ళి చూడలేదు కూడాను, అనుకుని బల్లకట్టు మని షినివెతికి పట్టుకుని వెంటనే అవతలిగట్టుకు జేరుకున్నాను.

## 2

కోమర్స్ అంటే యేమిటో కొంతమందికి తెలియక పోవచ్చు. ఒక్కొక్క జిల్లా తాలూకు విద్యార్థులంతా కలిసి ఓచోట జేరి విందుచేసుకుంటారు. అందరూ ఒకటే యూని ఫారం-మిలిటరీ నిక్కరు, ఎత్తు బూట్లు, చిన్న గీతల టోపీ గల జర్మన్ యువకులు సామాన్యంగా ఒక్కొక్క గ్రూపుకు ఒక్కొక్క పెద్దవాడుంటాడు. దాదాపు తెల్లవార్లూ విందు వినోదాల్లో యథేచ్ఛగా పొగ, పానీయాలు తాగుతూ పాటలు పాడుకుంటూ యూదుల్ని దూషిస్తూ కాలం గడిపేస్తారు. ఒక్కోసారి బ్యాండ్ కూడా వెంట తెచ్చుకోవడం కద్దు.

ఇలాంటి కోమర్సే ఒకటి ఆరాత్రి 'ల...' పట్నంలో 'సన్' హోటలుకు ఎదురుగా వున్న తోటలో జరుగుతుంది. హోటల్ లోనూ తోటలోనూ ఎక్కడపడితే అక్కడ జెండాలు గాలికి రెపరెపలాడుతున్నాయి. విద్యార్థులంతా నిమ్మచెట్లకింద

టేబుల్సుముందు కూర్చునివున్నారు. ఓ టేబులుకింద పెద్ద కుక్క ఒకటి ప్రశాంతంగా కూర్చునివుంది. వాద్యగాళ్ళు, వేటకొంచెం ఎడంగా కూర్చుని మధ్య మధ్య బీరు తాగి సేదతీర్చుకుంటూ హుషారుగా చిత్తంవచ్చినట్లు వాయించేస్తున్నారు. రోడ్డుమీద చాలామంది జనంమూగి, తోట కంచెకు జేరగిలబడి వినోదం చూస్తున్నారు. నేనూ వాళ్ళల్లో కలిసిపోయాను. ఆవిద్యార్థుల్ని చూస్తుంటే నాకు చాలా ముచ్చటేసింది. వాళ్ళ కౌగిలింతలు-విసురుపోవడాలు- తెలిసీ తెలియనిపోజులు-సూటిప్రేక్షణాలు-నిష్కారణమైన నవ్వు (ఇంతమంచి నవ్వు ప్రపంచంలో మరెక్కడా వుండదు)-ఉల్లాసభరితమై సజీవమైన ఆకౌమారపు వెల్లువ-ముందంజ (ఎక్కడికైనాసరే-ముందుకైతే చాలు) వెయ్యాలనే కాంక్ష-వాళ్ళ చిన్నతనపు ఆదమరుపు...అన్నీ గాఢంగా హత్తుకుపోయి నా హృదయాన్ని మేల్కొల్పాయి. వాళ్ళల్లో కలిసిపోయి గంతులు వేద్దామనిపించింది.........

"చూసింది చాలదా ఆస్యా ?"

అని రష్యన్ భాషలో ఓ పురుష స్వరం ఎవరినో అడిగింది.

"ఇంకొక్కరవ్వసేపు..."

అని మరో స్త్రీ స్వనం అదే భాషలో అంది.

తటాలున వెనక్కు తిరిగాను. నా దృష్టి ఒక స్ఫురద్రూపియైన యువకునిమీద పడింది. అతని చేయిపట్టుకుని పక్కనే నిలబడివుంది మరోపిల్ల.

"మీరు రష్యన్లా ?" అన్న ప్రశ్న అప్రయత్నంగా నా నోట్లోంచి దొర్లింది. అతను చిరునవ్వుతో అవునన్నాడు.

"అబ్బ! కల్లోకూడా అనుకోలేదు మనవాళ్ళెవరైనా కనిపిస్తారని! అందులోనూ ఇలాంటి కూపంలో-"

"మేమూ అనుకోలేదు సరీ. ఊఁ- మొత్తానికి ఈ పేడుక చూడడానికి రావడం మంచిదే అయింది...ఆఁ- నా పేరు గాగిన్. ఇది నా చెల్లెలు. మీరు ..మీపేరు..."

నా పేరు చెప్పాను. వెంటనే మాటల్లో పడిపోయాం. గాగిన్‌కూడా నాలాగే సరదాగా దేశాలు తిరుగుతూ వారం రోజుల క్రితమే అక్కడకు వచ్చాడట.

నిజం చెప్పొద్దూ-స్వర్గంలోకూడా విడాకుల్లాగా విదేశాల్లోకూడా రష్యన్‌లే తటస్థపడితే నాకు మహా చికాకు సామాన్యంగా. అల్లంత దూరాన వుండగానే వాళ్ళ నడకతీరు, బట్టలకట్టు, ముఖ్యంగా వాళ్ళ మొహాల కవళికలను బట్టే పోల్చుకోగలను. సాధారణంగా సరళంగా నేవున్నా ఒకోసారి తృణీకారభావం అధికారస్వభావం తొంగిచూసేవారి సామాన్య ముఖకవళిక హఠాత్తుగా అతిజాగ్రత్తకు ఆదుర్దాకు లోనైపోతుంది. ఒళ్ళు కుంచించుకుని 'హారిదేవుడా-నేనేం వెర్రి పని చేయలేదుగదా—వాళ్ళంతా నన్నుచూసి కాదుగదా నవ్వేది' అన్నట్లు వాళ్ల చూపులు తొట్రుపడతాయి...కాని మరుక్షణంలోనే మళ్ళీ ఆ వెనకటి ఠీవి-కళ-అప్పుడప్పుడ తాశ్చర్యపు పోజు...అవును-వీలైనంతవరకూ రష్యన్లని తప్పించుకునే తిరుగుతాను. కాని గాగిన్‌మటుకు వెంటనే నా మనసులో

పోతున్నపోయాడు. కొందరి కొందరి మొహాలు అలా చూస్తూ కూర్చుండిపోవా లనిపిస్తుంది అల్లాంటిది గాగిన్ ముఖం. స్నేహం చిప్పిలుతూ విశాలమైన నేత్రాలు-ఒంకులు తిరిగిన మెత్తని జుత్తు-ప్రసన్నమైన ముఖము...అతనివంక చూడకుండా అతనిగొంతు వింటే చాలు నవ్వుతున్నాడో లేదో అర్థమై పోతుంది. అలాంటి కంఠస్వనం అతనిది!

తన చెల్లెలని చెప్పిన ఆ అమ్మాయికూడా అందాల కుప్ప. చంద్రబింబంలాంటి ఆమె ముఖం-నాజూకైన చిట్టినాసిక పసిపిల్లల్లా మిసమిస లాడిపోతున్న బుగ్గలు-తళతళ మెరిసి పోతున్న కళ్లు-ఆమె ప్రత్యంగంలోనూ సౌష్ఠవం-ఏదో ప్రత్యేక విశేషం స్ఫురిస్తున్నాయి. ఆమెలో ప్రతిబింబిస్తున్న అమాయ కత్వం బాల్యం ముగ్ధత్వం చూస్తుంటే ఇంకా లోకంతో అట్టే అనుభవం కాలేదనిపిస్తుంది...అన్నకీ ఆమెకీ ఎక్కడా పోలికే లేదు.

గాగిన్ అన్నాడు-

"మా బసకి వెళ్దాం రండిసర్. ఇంకెంతసేపు చూస్తాం ఈ జర్మన్ పిల్లకాయల్ని? మరీ మేధకుల్లా వున్నారు. మన వాళ్లైతే అసలు కుర్చీలూ బల్లలూ విరగ్గొట్టడంతోగాని వినోదం ప్రారంభించరుగదా! ఏం ఆస్యా? ఇంటికి వెళ్దామా ఇహ? ఆస్యా తల వూపింది.

"మేం వూరిబయట ఓ ద్రాక్షతోటలో చిన్న బంగళా తీసుకున్నామండీ. చాలా బాగుంటుందిలేండి. చూస్తే వదిలి పెట్టలేరు మీరుకూడా. ఇంకాస్సేపట్లో చీకటి పడుతుంది.

వెన్నెల వచ్చేదాకా ఆగి అప్పుడు నది దాటుదాం...ఇంటి కెళ్ళేసరికి కాసిని పాలు సిద్ధంగా వుంచుతానంది ఇల్లుగలావిడ ముగ్గురం బయల్దేరాం. వూరు చుట్టూతా పూర్వ మెప్పుడో కట్టిన కోటగోడ ఇంకా వుంది. ఓ యిరుకుపాటి గేటులోంచి వూరిబయటపశ్చి గోడవార్నే వందగజాలు నడిచి ఓ చిన్న గేటు ముందు ఆగాం. గాగిన్ గేటు తెరిచి నిటాంకుగావున్న పెద్దగుట్ట మీదికి తీసుకుపోయే దారిని నడవసాగాడు. దోవకి అటూ యిటూ ద్రాక్ష తీగలు-అప్పుడే అస్తమిస్తూన్న సూర్యుడు-ఆతీగల్ని ముంచెత్తుతున్న సంధ్యారుణకాంతి ప్రవాహం-కొండ మీద అల్లంతదూరాన కనిపిస్తున్న తెల్లని బంగ్లా గోడలు-వసారా-కిటికీలు......దగ్గిరికి చేరుకోగానే గాగిన్ అన్నాడు-

"ఇదే మాయిల్లు. అదుగో ఇల్లుగలావిడ పాలుకూడా తీసుకునే వస్తోంది......గూటెన్ ఎబెన్డ్ మేడమ్!...వెంటనే కాస్త ఏదైనా తినాలి మనం. కాని యీలోగా-ఒక్కసారి వెనక్కి తిరిగి చూడండి మీారు...ఎలావుంది దృశ్యం?"

నిజంగా బ్రహ్మాండంగావుంది దృశ్యం. రైన్ నది ఎక్కడో దిగువన-లోయలోలాగా పచ్చని గట్లమధ్య తళతళ్ళాడుతూ ఒకవార సంధ్యాకాంతి ప్రతిఫలించి అరుణారుణంగా ప్రకాశిస్తూ ప్రవహిస్తోంది. ఒక గట్టున పొడుపుగు కూర్చున్న వూరు-వీధులు-ఇళ్ళు తీర్చిదిద్దినట్లు కనిపిస్తున్నాయి. చుట్టూతా కొండలూ, పొలాలూ విస్తరించుకువున్నాయి. చాలా అందంగావుంది దృశ్యం. కాని దీనికి మించి వుంది పై దృశ్యం. స్వచ్ఛమై అగాధంగా వున్న ఆకాశమూ వివిర్మలమైన వాతా

వరణమూ అవిరళమైన అంతరాళమూ నా మనోఫలకంలో నాటుకుపోయాయి. అంతయెత్తున వుండబట్టో యేమో అక్కడ గాలికూడా చల్లగా మెల్లగా తేలియాడుతూవుంది.

"అద్భుతమైన స్థలం ఎంచుకున్నారు మీరు" అన్నాను నేను.

"ఆస్యా కనిపెట్టింది దీన్ని" అంటూ అందుకున్నాడు గాగిన్" "ఊఁ రా ఆస్యా. నీ యజమాయిషీకానీ యిహ. ఇలా యీ ఆరబైటే భోంచేద్దాం ఈ పూట. ఇక్కడనుంచైతే ఆసంగీతంకూడా బాగా వినిపిస్తుంది...ఏమండీ - ఇది గమనించారా మీరు? దగ్గిరవుండి వింటే ఆ వాల్ట్జ-అబ్బ-నానా రభస, గోల గోలగా వుంటుందా-అదే దూరంనుంచి వింటే మన మనసులు కలకబారి ఏవేవోస్మృతితంత్రులు సంచలిస్తాయి."

ఆస్యా (ఆ అమ్మాయి పేరు అసలు అన్నా. కాని గాగిన్ ఆమెను ఆస్యా అని పిలిచేవాడు-మీకే అభ్యంతరం లేకపోతే నేనూ ఆపేరే వాడతాను-) ఆస్యా లోపలికి వెళ్ళి వెంటనే ఇల్లుగలావిడతో సహా బైటకు వచ్చింది. ఇద్దరూ కలిసి ఓ పెద్ద ట్రే పట్టుకువచ్చారు. అందులో ఓ పాలకూజా, ప్లేట్లు, చంచాలు, చక్కెర, బెర్రీపళ్ళు, రొట్టె వున్నాయి. అందరం కూర్చుని అరగించనాగాం. ఆస్యా నెత్తిమీద నుంచి టోపీతీసి పారేసి గిరజాలు తిరిగి మెడదాటి కిందికి దిగని నల్లని కురుల్ని వెనక్కి తోసుకుంది. మొదట నేనంటే కాస్త భిడియ పడింది గాని గాగిన్ కోప్పడ్డాడు.

"ఏమిటిఆస్యా అలా బిగుసుకుపోతావ్? ఆయనేమన్నా కొరుక్కుతింటారా నిన్ను?"

ఆస్యా కాస్త తబ్బిబ్బై చిరునవ్వు నవ్వింది. మరో క్షణం పోయాక తనంతతానే కల్పించుకుని నాతో మాట్లాడ టం మొదలెట్టింది. అబ్బ-అంత విసుగూ విరామంలేని మనిషిని నేనింతవరకూ చూసెరగను. ఒక్క-క్షణమైనా నిశ్చలంగా వుండ లేదుకదా. అనుక్షణమూ లేచటం లోపలికీ బైటికీ పరుగె త్తడం కూనిరాగాలు తియ్యడం వున్నట్టుండి విచిత్రంగా నవ్వటం-ఆ నవ్వటంకూడా అందరూ అనుకునే మాటలు విని కాక తన బుర్రలోకి వచ్చిన ప్రతి ఆలోచనకూ నవ్వుకుంటున్నట్టుంటుంది. చొంపకు చేరడేసివున్న ఆ కళ్ళునిర్భీతిగా ఉత్సాహం తళు క్కొత్తుతూ సూటిగా చూడగలవు. కాని అడపా తడపా కను రెప్పలు కుంచించుకుని నాగుండెల్లోకి చొచ్చుకు పోయేట్లు అహంగంగా చూచేది.

దాదాపు రెండుగంటలు అలా ఊసులాడుకుంటూ కూర్చున్నాం. దినం గతించింది. ప్రజ్వలించిన సాయంతనం ప్రశాంతమైన అరుణదీప్తిలోకి సన్నగిలి క్రమంగా కరిగి చీకటై పోయింది. ఇంకా మాట్లాడుకుంటూనే కూర్చున్నాం ఆ చల్లని పిల్లగాలుల సౌరభం అనుభవిస్తూ. గాగిన్ రైన్ వైన్ సీసా ఒకటి తెప్పించాడు. తాపీగా దాన్ని గురించి చర్చించాం కాస్సేపు. ఇంకా సంగీతం మా చెవులకు వినిపిస్తూనే వుంది కాని ధ్వని అంతకంతకూ మృదువుగా మధురంగా వుంది. వూరంతా దీపాలు వెలిగాయి. వున్నట్టుండి ఆస్యా తలవాల్చి కళ్ళల్లో

పడుతున్న ముంగురులు వెనక్కి తోసుకుని నిట్టూర్చి పడుకుంటానని చెప్పి ఇంట్లోకి పోయింది. కాని తన గదిలో దీపం వెలిగించుకోకుండా కిటికీప్రక్కనే నిలబడివున్న ఆమెను చాలా సేపు చూస్తూనే వున్నాను నేను. ఎట్టకేలకు చంద్రుడుదయించాడు. అంతా ఇందాకటికంటే భిన్నంగా కనిపించింది. చంద్రికలు రైన్‌నదీ తరంగాలతో దోబూచు లాడసాగాయి. కొన్ని అంధకారంలో మునిగిపోయాయి. కొన్ని వెలుగులో ప్రకాశిస్తున్నాయి. మా గ్లాసుల్లోని ద్రాక్షసారాకూడా తమాషాగా మెరిసిపోతోంది. వాయుదేవుడు రెక్కలు ముడుచుకుకూర్చున్నట్లు గాలికూడా వీచడం మానేసింది. సురభిళమైన నునువెచ్చదనాన్ని ఈనసాగింది నేల.

నేనూ లేచాను–

"ఇహ నింటికి పోవాలి. ఏరు దాటడానికిబల్లకట్టుకూడా దొరకదేమో ఇలా కూర్చుండిపోతే."

గాగిన్‌కూడా లేచి సరేనన్నాడు. ఇద్దరం కలిసి కొండ దిగసాగాము. హఠాత్తుగా మా వెనక రాళ్ళు రవ్వలు దొర్ల సాగాయి- ఆస్యా పరుగెత్తుకొస్తోంది.

"అరె-నువ్వింకా నిద్రపోయావనుకున్నానే!" అన్నాడు గాగిన్. కాని ఆస్యా జవాబులేకుండా మమ్మల్ని దాటి ముందుకు పరుగెత్తింది. మేం ఏటిఒడ్డుకు వెళ్ళేసరికి ఆస్యా అక్కడబల్లకట్టుమనిషితో మాట్లాడుతోంది. నేనుబల్లకట్టుమీదికి దూకి కొత్త మిత్రులదగ్గిర వీడ్కోలు తీసుకున్నాను. గాగిన్

మర్నాడు నా బసకు వస్తానని వాగ్దానం చేశాను. అతనిచేయి తీసుకునొక్కి, ఆస్యావైపుకూడా నా చేయి జాచాను. ఆస్యా అందుకోకుండా నావంకచూస్తూ తల అడ్డంగా వూపింది.

బల్లకట్టు మనిషిబల్లకట్టునునదిలోకితోసి తెడ్లువేయసా గాడు.నాలుగ్గజాలుపోంగానే వెనుకనుంచి "అబ్బ-చంద్రకాంతి పుంజంలోకి పోయావ్-దాన్ని ఛిద్రం చేశావ్" అని ఆస్యా కేకపెట్టింది. నేను పక్కకివొంగి నదిలోకిచూశాను. బల్లకట్టుకు ఒరుసుకుని చీకటి అలలు తబ్బిబ్బౌతున్నాయి.

"గుడ్ బై!" అని మళ్ళీ మారుమ్రోగింది ఆస్యా కంఠస్వరం. "రేపు కలుద్దాం" అన్నాడు గాగిన్.

ఆవలిఒడ్డుకు జేరి బల్లకట్టుదిగి వెనక్కు తిరిగి చూశాను. అవతలొడ్డున ఎవళ్ళూలేరు చూడ్డానికి. చంద్రుని కాంతిపుంజం మళ్ళీ బంగారపు వంతెనలా నది అంతా ఆవరించుకుంది. వాల్ట్జ సంగీతం సన్నసన్నగా ఇంకా చెవుల్లో పడుతూనేవుంది. గాగిన్ చెప్పింది నిజమే. ఆ పాట నా మనసును మీటింది. హృదయం విచలించింది. కమ్మని గాలి గుండెలనిండా పీల్చుకుంటూ నెమ్మదిగా బయలుదాటి నా గదికి చేరుకున్నాను. ఎందుకోసమో తెలీని ఆత్రుతతో కమ్మని బడలిక ఒళ్ళంతా ఆవేశించింది. చాలా ఆనందంగా వుంది...కాని-ఎందుకు నేనంత ఆనందంగా వున్నాను? ఏమిటి నన్నానందపరిచింది? నేనేమీ కోరలేదు ...నేనేమీ అనుకోనైనా లేదు...ఆనందంగామటుకువుంది.

గిలిగింతలు పెడుతున్నట్టున్న ఏవేవో భావాలతో నవ్వుకుంటూ గబగబా బట్టలు మార్చుకున్నాను. పక్కమీద

పడుకుని కళ్ళు మూసుకోబోతూండగా తళుక్కున మెరిసింది నా మనోఫలకంలో ఓ ప్రశ్న—

"నేను ప్రేమిస్తున్నానా ?" వెంటనే నిద్రపట్టేసింది-జోకొట్టిన పసిపాపలా పడుకుండిపోయాను.

# 3

మర్నాడు ఉదయం-మెలకువైతే వచ్చింది గాని ఇంకా పక్కమీదనుంచి లేవలేదు-నా తలవైపు కిటికీమీద ఎవరో కర్రతో తడుతున్నారు. దాంతోపాటు మేల్కొలుపుకూడానూ-గాగిన్ కంఠస్వరం వెంటనే గుర్తించాను. గబగబా లేచి వెళ్ళి తలుపు తీశాను.

"గుడ్‌మార్నింగ్ ! పెందలాడే లేపేసినట్టున్నాను మిమ్మల్ని. కాని ఎలాంటి ఉదయమో చూడండి-స్వచ్ఛమైన ధీరసమీరం-మంద మందంగా తుషారం-భరద్వాజపక్షుల కిల కిలలు—"

వొంకులు తిరిగిన తళతళ్ళాడుతున్న మెడతో ఎఱ్ఱని బుగ్గల్తో గాగిన్‌కూడా ఆనాటి ఉదయంలాగే స్వచ్ఛంగా శుభ్రంగా వున్నాడు.

నేనుకూడ బట్టలు వేసుకున్నాక ఇద్దరం తోటలోకి వెళ్ళి కూర్చున్నాం. కాఫీ అక్కడకే తెప్పించుకుని కబుర్లు

సాగించాం. గాగిన్ తన భవిష్యత్ ప్రోగ్రాం అంతా చెప్పు కొచ్చాడు. స్వతంత్రుడు-అన్నోదకాలకి లోటులేని ఆదాయం-కాదూ కూడదూ అనే వాళ్ళెవరూ లేరు. తన జీవితమంతా కళారాధనలోనే గడుపుతాడట. అసలు మనస్సెటూ కుదుర్చు కోలేక ఇన్నాళ్ళూ వృధా అయిపోయినందుకే చాలా చింతించాడు పాపం. నేనూ నా ప్లాన్లూ అవీ అన్నీ అతనికి చెప్పేను. దుఃఖమయమైన నా భగ్నప్రేమ రహస్యంకూడా చెప్పేశాను. ఓపికతోనే విన్నాడుగాని, నా ప్రేమ నిష్ఫలప్రయాస అతనిలో కించిత్తయినా సానుభూతిని కలిగించినట్లు లేదు. బాగుందన్నట్టు నాతోబాటు అతనూ నాలుగు నిట్టూర్పులు విడిచి ఇహ లేచి ఇంటికి వెడదాం రండన్నాడు. తను గీసిన 'బొమ్మలు' చూపిస్తానన్నాడు. నేనూ వెంటనే అంగీకరించి లేచాను.

ఆస్యా ఇంటిదగ్గర లేదు. శిధిలదుర్గం దగ్గరకు వెళ్ళిందని ఇంటియజమానురాలు చెప్పింది. 'ల...' పట్నానికి రెండు మూడు మైళ్ళలో ఒక పురాతనమైన శిధిలభవనం-ఎవరో జమీందార్లదిపుంది. గాగిన్ తనపోర్టుఫోలియోలన్నీ విప్పతీశాడు. బొమ్మలన్నిటిలోనూ కూడా మంచి జీవకళ వుంది. కుంచె చాలా స్వేచ్ఛగా నడిచింది. కాని ఒక్కటికూడా పూర్తికాలేదు; గీయటంకూడా కాస్త అజాగ్రత్తగా మసక మసకగా వుంది. అదేమాట అతనికూడా చెప్పాను.

"అవునండీ. మీరు చెప్పింది నిజమే. మరీ కచ్చితనంగా పున్నాయి. కాని-ఏం చెయ్యను చెప్పండి. ఇది నేనేం ప్రత్యేకించి అభ్యసించలేదు. దానికితోడు సహజమైన స్లావ్

మందకొండితత్వమూనూ. ఊహలుమాత్రం నక్షత్రమండలాన్ని అందుకుంటాయి. పర్వతాల్నే పెకలించివెయ్యగలమనిపిస్తుంది. తీరా నిర్వహణదగ్గరకొచ్చేసరికి ఎక్కడలేని నీరసమూ విసుగూనూ!"

నేనేదో కాస్త ప్రోత్సాహకరంగా మాట్లాడబోయాను కాని గాగిన్ చేత్తో వారించి పోర్ట్‌ఫోలియోలన్నీ పోగుజేసి ఎత్తి సోఫాలో పడేశాడు.

"కాస్త సహనంకసక నాకల వడితేనా ఏదోవిధంగా నిలబడగలను—లేకపోతే ఇలా జడుణ్ణయి వుండాల్సిందే!" అన్నాడు పళ్ళు బిగపట్టి. అంతలోనే సంబాళించుకుని- "సరే పదండి-ఆస్యా ఎక్కడుందో ఏమిటో చూద్దాం" అన్నాడు.

ఇద్దరం ఇంట్లోంచి బైటికి వచ్చాం.

# 4

ఆపాడుబడ్డ దుర్గం దగ్గరకు వెళ్ళాలంటే దాదాపు అడివిలాంటి లోయలోంచి సలికెళ్ల పాములాంటి దారినపోవాలి. పక్కనే ప్రవహిస్తున్న సెలయేరు కొండలవాలుల ప్రశాంతంగా పవ్వళించిన మహానదిని ఆలింగనం చేసుకుందామనే ఆత్రుతతో మిట్టపల్లాల్లోపడి పడుతూ లేస్తూ నిర్ఝరిస్తూ పరుగిడుతోంది. మనోహరమైన దృశ్యాలు, సూర్యకిరణాలు తమాషాగా పడి చిత్రవిచిత్రంగా కనిపిస్తున్న తావులు చూపించసాగాడు గాగిన్.

అతనేమంత గొప్ప చిత్రకారుడు కాకపోయినా అతని హృదయంలో కొట్టు మిట్టాడుతున్న కళాపిపాస కళాప్రియత్వమూ నాకవగతమైనాయి.

సిథిలదుర్గం దగ్గరకు త్వరగానే జేరుకున్నాం. అల్లంత దూరాన వుండగానే ఓ గోపురం కనిపించింది. ఏమూలగా పగిలి సందు ఏర్పడ్డా ఇంకా పటిష్టంగానే కనిపిస్తోంది. దాని కటూయిటూ పాచిపట్టిపోయి గడ్డీ గాదం మొలకెత్తిన కోటగోడలున్నాయి. బైటికి పొడుచుకొచ్చిన కొండరాళ్ళకి పట్టిన పాచి వ్రేలాడుతూంది. గేట్లుమాత్రం ఏమాత్రం చెడిపోకుండా ఉన్నాయి. మేము గేటుదగ్గరకి వెళ్ళేసరికి ఒక స్త్రీవిగ్రహం లేడిలా రాళ్ల గుట్టలుకూడ లెక్కజేయకుండా పరుగెత్తి గోడయెక్కి అంచుదాకా పోయి గభాల్న ఆగిపోయింది. ఇంకో అడుగు ముందుకేస్తే కింద అగాధమే కనిపించింది.

"అరె-ఆస్యా అండీ! ఆస్యా! పిచ్చెక్కిందేమిటి దానికి?" అని విస్తుపోయాడు గాగిన్.

గేటు దాటి లోపలికి వెళ్లాం. తీగెలు, పొదలు, చెట్లూ చేమా విపరీతంగా పెరిగిపోయాయి. గోడ చూరుమీద నుంచున్నది ఆస్యాయే. మావైపు తిరిగి ఉన్న చోటనుంచి కదలకుండానే పకపక నవ్వింది. గాగిన్ నీ పని చెప్తానుండు అన్నట్టు తర్జని ఆడించాడు. నేనూ గొంతెత్తి ఆమె మొండిసాహసానికి కోప్పడ్డాను.

గాగిన్ నా చెయ్యి లాగాడు - "ష్! దాన్నలా వదిలెయ్యండి. దానిసంగతి మీరెరుగరు. ఆ గోపురం ఎక్కా

లనుకున్నా ఎక్కేస్తుంది. ఇలారండి - మనమిక్కడ కాలక్షేపం చేద్దాం."

నేను చుట్టూ కలయజూచాను. ఓ చిన్న కొయ్యబడ్డీలో ఒక ముసలమ్మ కూర్చుని మేజోడు అల్లుతూ ఆగి సులోచనా ల్లోంచి మా వంక చూస్తోంది. యాత్రీకులకు బీరు, జింజర్ బ్రెడ్, సెల్జెనాటర్, అమ్ముతూవుంటుంది ఆమె. మేమిద్దరం ఆవిడదగ్గర కెళ్ళి పాతకాలపు డొక్కుల్లో బీరు సేవిస్తూ ఓ కొయ్య బెంచీ మీద కూచున్నాం; ఆస్యా ఆ గోడమీదే కాళ్లు ముడుచు కుని కూర్చుంది. తలమీద దోమతెరలాంటి సన్నని రుమాలు కట్టుకునివుంది. స్వచ్ఛమైన ఆకాశ నేపథ్యంలో ఆమె నిజంగా మనోహరంగా కన్పించింది. కాని ఆమెను చూస్తుంటే నాలో ఏదో విరక్తభావం జనించింది. కిందటిరోజు ఆమెలో ఏదో అసహజత - తెచ్చిపెట్టుకున్న వ్యగ్రత కనిపించింది...నన్నేదో ఆశ్చర్యపరచి ఆకిర్షించాలనా ఆమె తాపత్రయం అనిపించింది నాకు. ఎందుకది? ఎంత చిన్నతనపుచేష్ట!

నా ఆలోచనలన్నీ పసిగట్టినట్లు నావంక ఓసారి నిశితంగా చూసి మళ్లీ విరగబడి నవ్వింది. రెండు గంతుల్లో గోడమీద నుంచి గెంతి ముసలమ్మదగ్గరకు పరుగెత్తుకొచ్చి ఓగ్లాసుడు మంచినీళ్ళడిగింది.

తన అన్నవంక తిరిగి -

"నేను తాగడానికనుకుంటున్నావా? కాదు - ఆగోడ మీద పూలచెట్లు నీళ్ళుపోసే దిక్కులేక మాడిపోతున్నాయి-వాటికోసం!" అంది.

గాగిన్ ఆమె మాటలు వినిపించుకోనేలేదు. గ్లాసు చేత బట్టుకుని మళ్ళీ గోడ మెక్కింది ఆస్యా. ఏదో ఘనకార్యం చేస్తున్నట్లు సగర్వంగా సవిలాసంగా వొంగి ప్రతి పూలచెట్టు మీదా రెండు మూడు నీటిబొట్లు విక్షేపించసాగింది. ఆమె లాలిత్యం లాఘవం మనోహరమైన అవయవ విన్యాసం-అన్నీ బాగానే వున్నాయి, ఐనా ఆమెమీద నాకు చిరాకు తగ్గలేదు. వున్నట్టుండి ఆస్యా కాలుజారి కింద పడిపోతున్నట్టు ఒక్కసారి గావుకేక పెట్టి మరుక్షణమే పగలబడి నవ్వసాగింది. నాకు మరీ చిరాకేసింది.

ముసలమ్మ ఓక్షణం తలెత్తిచూసి గొణుక్కుంది - "మేకపోతులా పాకిపోతుంది పిల్ల!"

ఎలాగైతేనేం చివరికి ఆస్యా పూలమొక్కలకి నీళ్ళు పోయడం పూర్తిచేసి ఆకతాయితనంగా ఊగిసలాడిపోతూ మా దగ్గరకి వచ్చింది. ఆమె కనుబొమలు నాసికాపుటాలు పెదవులూ విచిత్రంగా వెక్కిరిస్తునట్లు విచలించాయి. కొంతవరకు లక్ష్యం కొంత ప్రమోదం స్ఫురిస్తున్న ఆమె నల్లని కళ్ళు అర్ధనిమీలితా లయ్యాయి.

"నా ప్రవర్తనేం బాగులేదంటారా? మీరేమంటే నాకేం-నిజానికి మీరు నన్ను మెచ్చుకుంటున్నారని నాకు తెలుసు!" అని అంటున్నట్లుందామె ముఖం.

"బాగుంది ఆస్యా! చాలా బాగుంది!" అన్నాడు గాగిన్ గొంతు బిగబట్టి.

ఆస్యా వున్నట్టుండి సిగ్గుపడ్డట్లు కళ్ళు నేలకు దించి ఏదో నేరంచేసినదానిలా నెమ్మదిగా వచ్చి మా పక్కన కూర్చుంది. అప్పుడే ఆమె ముఖం పరీక్షగా చూసింది నేను. అంత త్వర త్వరగా మారిపోయే ముఖం నేనింకెక్కడా చూడలేదు. మరికొద్ది నిమిషాలకల్లా ఆమె ముఖం వెల్లబారింది. గాఢమైన విషాద చ్ఛాయలు అలుముకున్నాయి. ముఖంలోని అవయవాలే పెరిగి నిశితంగా వున్నాయా అనిపించింది. గంభీరమైన నిశ్చలత దాల్చింది ఆస్యా. ఆస్యా మా వెనకాలే వస్తూండగా శిథిల దుర్గంచుట్టూ తిరిగాం దృశ్యాలన్నీ చూసి ఆనందిస్తూ. భోజన సమయం దగ్గిరికొస్తోంది. గాగిన్ మళ్ళీ ముసలమ్మ దగ్గిర బీరుకొన్నాడు. గ్లాసు ఎత్తి నావంకతిరిగినవ్వుతున్న కళ్ళను నాకంతా తెలుసన్నట్లు చికిలించి- "మీ హృదయేశ్వరి ఆరోగ్యానికి !" అన్నాడు.

"ఆయనకి- మీకో హృదయేశ్వరి వుందా ?" అని అడిగింది ఆస్యా గభాల్న.

"ఎవరికుండదు ?" అని ఉడికిలించాడు గాగిన్.

ఆస్యా ఒక్కక్షణం ఆలోచించింది. మళ్ళీ ఆమె ముఖం మారిపోయింది. మళ్ళీ దేన్నో ప్రతిఘటిస్తున్నట్టు మూర్ఖ నిర్లక్ష్యం ఆవరించిందామె ముఖాన్ని.

తిరుగుదోవలో ఇంకా కిరగబడిపోయింది. ఒకచేట నవ్వ్-ఇష్టం వచ్చినట్లల్లా ఆడి పోయింది. ఒక చెట్టుకొమ్మ విరిచి తుపాకిలా బుజాన వేసుకుంది. దోవలో ఒక బ్రిటిష్ కుటుంబం ఎదురైనట్టు జ్ఞాపకం. వాళ్ళందరుకూడా ఆస్యా

వంక వింతగా పరిహాసంగా హీనంగా చూశారు. వాళ్ళని ఇంకా రెచ్చగొట్టాలని ఆస్యా పిచ్చిపాట కూడా ఏదో పాడ సాగింది. ఇంటికి జేరుకోంగానే తన గదిలోకి వెళ్ళిపోయి మళ్ళీ భోజనానికిగాని బైటికి రాలేదు. ఈసారి వేషంమార్చి దర్శన మిద్దామనుకున్నట్టుంది – వున్నవాటిల్లోకల్లా మంచిగౌను ఏరి వేసుకుంది. జుట్టు అణగదువ్వి గౌనులోపలికి ముడిచి చేతులకు జోళ్ళుకూడా వేసుకుంది. టేబులుదగ్గర చాలా వినయవిధేయ తలతో మెలిగింది. భోజనం ఆట్టే చెయ్యలేదు. వైన్‌గ్లాస్‌తో నీళ్లుమాత్రం చప్పరిస్తూ సత్సాంప్రదాయంలో పుట్టి పెరిగి బాగా చదువుకున్న పిల్లలా ప్రవర్తించింది. గాగిన్ కూడా ఆమెను ఏమీఅనలేదు. ఆమె పోకడలన్నీ సహించి వదిలేయడం అతని కలవాటేనల్లే వుంది. మధ్యమధ్య మందహాసంతో 'ఆఁ- అదేదో చిన్నపిల్ల- పోనిద్దురూ' అన్నట్టు నావంక చూసేవాడు. భోజ నం కాంగానే ఆస్యా లేచి తన సన్నని నడుంవంచి శిరసు విన మించి లేచి, టోపీ పెట్టుకుంటూ ఫ్రాలూయీని చూసిరానా అన్నయ్యా అని అడిగింది.

అన్నయ్య సదామందహాసం కాస్త తబ్బిబ్బైంది—

"నా అనుమతి ఎప్పణ్ణుంచీనేవ్ !?...ఐనా - మాతో వుండడం అంత విసుగ్గా వుందేమిటి?"

"అబ్బెబ్బే అదికాదు. ఫ్రాలుయీ దగ్గరకొస్తాననినిన్న చెప్పాను. అదీగాక మీరిద్దరే వుంటే ఇంకాస్త కులాసాగా వుంటారేమోనని! శ్రీమాన్ న...గారు ఇంకేమైనా సరదా

కబుర్లు చెప్తాడేమో నీకు!" అని నావంక చూపి వెళ్ళిపోయింది ఆస్యా.

గాగిన్ నా చూపు తప్పించుకుని తల వంచుకున్నాడు-

"ఫ్రాలూయిా అంటే-చచ్చిపోయిన ఈ ఊరిపెద్దకు భార్య తెలివితేటలు పూజ్యమైనా చాలా మంచావిడ లేండి. ఆస్యా అంటే బలే ప్రేమ కుదిరిందావిడకి. కొంచెం తక్కువ తరగతి మనుష్యులతో పరిచయం చేసుకోవడమంటే ఆస్యాకి మహా సరదా. దీనికంతకూ మూలకారణం సహజగర్వం అనుకుంటాను. మీరూ గమనించే వుంటారు-మొత్తానికి ఆస్యా గారాబాల కూచి......"

ఒక్కక్షణం ఆగి మళ్ళీ అన్నాడు గాగిన్-"ఏంచెయ్యను చెప్పండి. అసలెవళ్ళతోనూ నేను ఖరాఖండీగా వుండలేను. ఆస్యాతో అసలే వుండలేను. దాని విషయంలో గారాబంగా వుండితీరాలి నేను"

నేనేం మాట్లాడలేదు. గాగిన్ విషయం మార్చాడు. అతన్ని చూసినకొద్దీ అతనిపై నా కభిమానం ఎక్కువౌతుంది. అతన్ని బాగా అర్ధంచేసుకున్నాను. అరమరికలు లేక ఎవర్నైనా ఇట్టే నమ్మేసే సిసలైన రష్యన్ స్వభావం అతనిది. కాని విపరీతమైన బడలిక. పట్టుదల, చురుకు బాలు ఏకోశానాలేవు. యవ్వనం అతనిలో ప్రశాంత దీప్తిని కలిగించిందేగాని పొంగి పొరలలేదు. మంచి ఆకర్షణ తెలివితేటలూ వున్నాయిగాని పూర్తిగా పరిపక్వాని కొచ్చాక ఎలా తయారౌతాడో ఊహించలేకుండా వున్నాను. కళాకారుడౌతాడా? కాని కళా

కాయకు కావాలంటే పడాల్సిన శ్రమ - నిర్విరామంగా నడుం వంచి...'అది - ఆ శ్రమ నీవల్ల కాదు నువ్వా బాధ పడలేవు రా నాయనా' అనుకున్నాను. అతని అనిశ్చయ స్వభావం పెదవి కదపని మాటలతీరు చూస్తుంటే అలా అనిపించిందినాకు. కాని అతన్ని ప్రేమించకుండా వుండటం అసంభవం. హృదయమిచ్చి పుచ్చుకోగల మనిషి ! కొంతసేపు సోఫాలో జేరగిలబడి, కొంత సేపు బంగ్లాముందు పచార్లుచేస్తూ ఇద్దరం మూడు నాలుగు గంటలు గడిపాం. ఈ నాలుగు గంటల్లోనూ మా స్నేహబంధం విడరానిబంధంగా దృఢపడిపోయింది.

సూర్యుడస్తమించాడు. నేను వెళ్లిపోవలసిన సమయం కూడా వచ్చింది. ఆస్యా ఇంకా తిరిగి రాలేదు.

"అబ్బ-ఎంత స్వేచ్ఛ దీనికి ! సరే...నే రానా మీతో యింటిదాకా ? దోవలో ఫ్రాలూయీ ఇంటివగ్గరకూడా చూడ వచ్చు ఆస్యా అక్కడుందేమో. మీ కాటేజ్ దూరంకూడా కాదు" అన్నాడు గాగిన్.

ఇద్దరం కొండదిగి ఒక ఇరుకు సందులోకి తిరిగి ఓ నాలు గంతస్తుల ఇంటిముందు ఆగాం.

"ఆస్యా ! ఆస్యా !" అని కేకపెట్టాడు గాగిన్.

మూడో అంతస్తుమీద ఓకిటికీ తెరుచుకొని ఆస్యా చిట్టి తలకాయ బైటికి తొంగి చూసింది. ఆమె వెనకనుంచి పళ్లూడి పోయిన మసక కన్నుల జర్మన్ ముదుసలి ఒకతెకూడా తొంగి చూస్తోంది.

"ఇక్కడే వున్నా నన్నాయ్" అంది ఆస్యా మోచేతులు కిటికీబద్దీమీద ఆనిస్తూ. "ఇక్కడెంత బాగుందనుకున్నావ్ ఇదుగో పట్టుకో–" అంటూ జెరేనియమ్ పూలగుత్తి ఒకటి విసిరేసింది—

"నేనే నీ హృదయంలో వున్నాననుకో!"

ఫ్రాలూాయిూ నవ్వింది.

"న...గారు ఇంటికి వెళ్ళిపోతున్నారు. నీతో చెప్పి వెళ్తారట!" అని గాగిన్ మళ్ళీ కేకపెట్టాడు.

"ఓ! అలాగా? ఐతే ఆయనకే ఇవ్వు ఆ పువ్వు. ఇదుగో వచ్చేస్తున్నా."

ధడాల్న కిటికీ మూసేసింది. ఫ్రాలూాయిూని ముద్దెట్టుకునికూడా వుంటుంది. గాగిన్ ఏం మాట్లాడకుండా పువ్వు నాచేతికిచ్చాడు. నేనూ ఏం మాట్లాడకుండా అది తీసుకుని జేబులో పెట్టుకుని ఏటిఒడ్డుకు వెళ్ళి బల్లకట్టుయెక్కి అవతలి ఒడ్డుకు జేరాను.

ఏదో విచిత్రమైన హృదయభారంతో ఏ ఆలోచనా లేక ఇంటికి పోతూండగా ఒక అతి పరిచితమైన వాసన గప్పున గుబాళించింది ఆ వాసన సామాన్యంగా జర్మనీలో ఎక్కడా లేదు. అలానే నిలబడిపోయి పరికించి చూశాను. రోడ్డుపక్కనే జనపనార మొక్క ఒకటి కనిపించింది. ఆ స్టెప్పీ సువాసనతో నా జన్మభూమి నాకళ్ళముందు తళుక్కున మెరిసి రెక్కలు కట్టుకు అక్కడికి వెళ్ళిపోవాలనిపించింది. 'ఇక్కడేంచేస్తున్నా

న్నేను? ఈ విదేశంలో విజాతీయులమధ్య ఎందుకిలా తిరుగు తున్నాన్నేను?' నా హృదయాన్ని కుంగదీస్తున్న భావం ఒక్క సారిగా కలతజెంది అగ్నిజ్వాలలు రేపింది. కిందటిరోజుకంటె విపరీతమైన భావాందోళనతో కొంపను జేసుకున్నాను. ఏదో కోపంలాంటిది నన్ను చాలాసేపటివరకూ వదిలిపెట్టలేదు. నాకే అర్థంకాని విసుగు, చిరాకు నన్ను నమిలేశాయి. చివరకువిల్లాగో కూర్చుని రోజూలాగే చపలచిత్తురాలైన ఆ వితంతువుని తలుచుకుంటూ ఆవిడ ఉత్తరం ఒకటి బైటికితీశాను. కాని అది చదవనేలేదు. నా ఆలోచనలన్నీ వెంటనే మరోమలుపు తిరి గాయి...ఆస్యాగురించి ఆలోచించసాగాను. మాటల సంద ర్భంలో రష్యాకు తిరిగి వెళ్ళడానికేదో అడ్డంకి వుందని సూచిం చినట్టు జ్ఞాపక మొచ్చింది......

"అసలు ఆమె అతని చెల్లెలేనా?" అని బిగ్గరగా ప్రశ్నించుకున్నాను.

బట్టలు మార్చి పక్కమీద పడుకుని నిద్రపోవడానికి ప్రయత్నించాను. కాని గంటతర్వాత మళ్ళీ లేచికూర్చున్నాను.

'తెచ్చిపెట్టుకున్న నవ్వుల్లో కులికిపోయిన ఆ వయ్యారి భామ'మీదికే పోతున్న ఆలోచనల్ని అలా వదిలేసి వూరు కున్నాను.

"ఫార్నేసినా కుడ్యచిత్రాల్లో రాఫెల్ గెలేటియాలా వుంది ఆస్యా...అది వాడి చెల్లెలుకాదు కూడానూ!..."

విధవరాలి వుత్తరం వెన్నెట్లో తెల్లగా మెరుస్తూ నేల మీద పడివుంది.

# 5

మర్నాడు ఉదయం మళ్లీ బల్లకట్టు యెక్కి 'ల...'కు వెళ్ళాను. గాగిన్‌ను చూడటానికే వెళ్తున్నానని పైకి ఎంత అనుకున్నా అసలు నేవెళ్తున్నది ఆస్యాకోసమేనని నాకు తెలుసు. ఇవ్వాళ ఆమె ఎలా ప్రవర్తిస్తుంది-? కిందటి రోజులాగే చమక్కులు చేస్తుందా లేదా అనినాకుతూహలం. ఇద్దరూ హాల్లోనే కూచ్చుని వున్నారు. రాత్రీ పొద్దునా రష్యానిగురించి ఒకటే ఆలోచించడంవల్లనో యేమో, ఆస్యా అతి సామాన్యురాలై మూర్తీభవించిన రష్యన్ స్త్రీత్వంలా సాక్షాత్కరించింది. పాతగౌను వేసుకుని, జుత్తంతా అదిమి చెవుల వెనక్కు దువ్వి కిటికీపక్కనే కూచ్చుని జీవితంలో మరేపని ఎరుగనట్లు నిశ్శబ్దంగా నిరాడంబరంగా ఏదో ఎంబ్రాయిడరీ అల్లుకుంటూ నిశ్చలంగా వుంది. తలెత్తి మాట్లాడకుండా వంచిన తల యెత్తకుండా పని చేసుకుంటున్న ఆస్యాని చూస్తుంటే మన దేశంలో కాట్యాలూ మాషాలూ కళ్ళముందు గోచరించారు. "మాతా ప్రియమాతా" అని ఆస్యా కూనిరాగం తీయటం ప్రారంభించడంతో ప్రకృతి సంపూర్ణమైంది. కొంచం పాలిపోయి, ఉత్సాహం ఉరకలువెయ్యని ఆమె ముఖం చూస్తూ నిన్నటి కలలన్నీ తలుచుకునేసరికి ఎందుకో తెలీని పశ్చాత్తాపం ఆవేశించింది నన్ను...

ఆ రోజుకూడా చాలా బాగుంది. బైటికెళ్ళి బొమ్మలు గీసుకురావాలనుకున్నాడు గాగిన్. అతనికేం అభ్యంతరం లేక పోతే నేనూ వస్తానన్నాను.

“అహఁ హఁ- తప్పకుండా రండి. మంచి సలహాలైనా ఇవ్వగలరు” అంటూ పోర్ట్‌ఫోలియో చంకన పెట్టుకుని బయల్దేరాడు గాగిన్. నేనూ అతన్ని అనుసరించాను. ఆస్యా ఇంట్లోనే వుండిపోయింది. వెళ్ళేముందు గాగిన్ పులుసు మరీ పల్చబడకుండా చూడమని ఆస్యాతో అన్నాడు. సరేనంది ఆమె. ఇద్దరం దిగువ లోయలోకి పోయి కూర్చున్నాం. కాగితం తెరిచి పెన్సిలు చేతబట్టి బారజాచుకున్న శాఖలతో ఒక ఓక్ చెట్టు స్కెచ్ వేయసాగాడు గాగిన్. ఆపక్కనే నేనూ నడుం వాల్చి జేబులోంచిఓపుస్తకంతీశాను. రెండు పేజీలుమించి మరిసాగలేదు. గాగిన్‌కూడా కాగితం ఖరాబు చేయడంతప్ప సాధించిందేమీలేదు. కబుర్లతో పొద్దుబుచ్చాం. కళాకారుడనేవాడు ఏ మార్గం తొక్కాలి - ఎలా పనిచేయాలి - ఏ పద్ధతిన - ఏవి విసర్జించాలి-ఏవి స్వీకరించాలి - అసలు ఈరోజుల్లో కళాకారుని విశిష్టత ఏమిటి - ఇలా అనేక విషయాలు చర్చించుకున్నాం. చివరికి 'ఇవాళ భావాలురావడంలేదు, అనిగాగిన్‌కూడా పక్కనే వచ్చి పడుకున్నాడు. ఏవేవో మాట్లాడుకున్నాం. ఒకరి హృదయాలొకరికి విప్పిచెప్పుకున్నాం. ఇంటికి తిరిగి వచ్చేసరికి ఏదో ఘనవిజయం సాధించినట్లు మా హృదయాలు సంతృప్తిగా తేలిగ్గా వున్నాయి. ఆస్యా మేం వెళ్ళేటప్పుడెలా వుందో ఇప్పుడూ అలానే అక్కడే కూర్చుని వుంది. బాగా

పరిశీలించి చూచాను ఆమె ముఖం - టక్కు టమారుగాని, కొత్త పాత్ర నభినయిస్తున్నట్టుగాని ఎక్కడా చిన్నమెత్తు సూచనకూడా కనిపించలేదు ఈసారి ఆమె నాటకమాడుతోం దని ఎవరూ అంటానికి వీల్లేదు.

సాయంత్రం అయింది. ఆస్యా నాలుగుసార్లు ఆవులించి పెందలాడే తన గదిలోకి వెళ్ళిపోయింది. నేనూ వెంటనే గాగిన్‌తో చెప్పి ఇంటికి పోయాను. కలలకి స్వస్తి చెప్పాను - పడుకోబోయేముందు మాత్రం హఠాత్తుగా ఆశ్చర్యపడ్డట్టు జ్ఞాపకం -

"అబ్బ - ఏం ఊసరవెల్లి రా పిల్ల!...ఏమైనా - అతని చెల్లెలుమాత్రం కాదని నా నమ్మకం!" అనుకున్నాను

# 6

రెండు వారాలు దొర్లిపోయాయి. ఈ రెండువారా ల్లోనూ ప్రతిరోజూ నేను గాగిన్ బంగ్లాకు వెళ్తూనే వున్నాను. ఆస్యా నన్ను తప్పించుకు తిరుగుతున్నట్లనిపించింది గాని వెనకటిలాగా చలచిత్తపు వికారాలేం పోవడంలేదు. నవ్వుకూడ తగ్గించేసింది. తనలో తాను అమితమైన వ్యథతో కుంగుతున్నట్లుంది. మనిషిని బాగా పరిశీలించాను నేను.

ఫ్రెంచి, జర్మన్ భాషలు రెండూ ధారాళంగా మాట్లాడగలదు. కాని గాగిన్ చదువుకీ ఈమె చదువుకీ

ఏమాత్రం పోలిక లేదు - ఈమెదంతా అదో రక
మైన అసాధారణమైన చకువులా అనిపించింది. చిన్నతనం
నుంచీకూడా ఓతల్లి చేతుల్లో పెరిగినట్టుకూడా అనిపించలేదు.
వేసక్ టోపీ, ఆర్టిస్ట్ స్మాక్ మినహాయిస్తే తాడి ఎక్కు
వైన రష్యన్ పెద్దమనిషిలా ఒద్దికంగా వుంటాడు గాగిన్. కాని
ఆస్యా అలాకాదే! ఆమె ప్రతి కదలికలోనూ ఏదో కలత-
వ్యాకులత కనిపిస్తుంది. ఇంకా పొంగారని ద్రాక్ష సారాయం,
చల్లారని కషాయం. వస్తుతః సిగ్గరి, పిరికిమనిషి. తన భిడియా
నికి తానే సిగ్గుపడి బలవంతాన ధైర్యం స్వేచ్ఛ ప్రదర్శించ
డానికి ప్రయత్నించిందిగాని కృతకృత్యురాలు కాలేకపోయింది
పాపం. చాలాసార్లు ఆమె గతాన్నిగురించీ రష్యాలో వాళ్ళ
జీవితాన్నిగురించీ అడిగానుగాని, సరిగా సమాధానం రాలేదు.
విదేశాలకొచ్చేముందు చాలాకాలం పల్లెటి దిక్కున వుందని
మాత్రం గ్రహించగల్గాను. ఓరోజు ఒంటరిగా కూర్చుని ఏదో
పుస్తకం చూస్తోంది. రెండుచేతుల్లోనూ తలపెట్టుకుని వేళ్ళన్నీ
జుత్తులోకి దోపి అచ్చుకాగితాన్ని నమిలేస్తోంది.

"బ్రేవో! ఎంత శ్రమ-ఎంతశ్రమ పడుతున్నావ్!"
అంటూ ఆమెను సమీపించాను నేను.

ఆస్యా తలయెత్తి నావంక నిశితంగా చూచింది–

"నవ్వటంతప్ప నాకింకేం చేతకాదనుకుంటున్నట్టు
న్నారు!" అని వెళ్ళిపో నుంకించింది.

పుస్తకంమీద పేరుచూశాను-ఏదో ఫ్రెంచి నవల.

"ఐనా మీరెన్నుకున్న పుస్తకంకూడా అట్టే మంచిది కాదని నా అభిప్రాయం!" అన్నాను

"ఇంకేం చదవాలి మరి నేను?" అంటూ ఆస్యా పుస్తకం టేబులుమీద విసిరికొట్టి-"అలా ఎటన్నా పోయి సరదాగా కాలక్షేపం చేస్తాను" అంటూ గార్డెన్‌లోకి పరుగెత్తింది.

ఆవేళ సాయంత్రం గాగిన్‌కి 'హెర్‌మన్ అండ్ డరోతియా' చదివి వినిపించాను. మొదట ఆస్యా మా పక్క నుంచి అటూ యిటూ నాలుగుసార్లు తిరిగి తర్వాత తల ఓ పక్కకి తిప్పుకుని నాపక్కనే కూర్చుంది చదవటం పూర్తయ్యే దాకా. మర్నాడు మరీ గుర్తుపట్టలేకపోయానామెని. కొంత సేపటికి హఠాత్తుగాగాని స్ఫురించలేదు డరోతియాలా ఆదర్శ గృహిణిలా ప్రవర్తిస్తోందని. ఆ పిల్ల నాకో అంతు దొరకని సమస్యై కూర్చుంది అంతమృదుల హృదయనూ అంత ముంగోపినీ నే నింకెక్కడా చూడలేదు. ఓ చెంపనా ఒళ్ళుమండేట్టు చేస్తూనే నన్నాకర్షిస్తోంది. ఆ రోజు కారోజు ఆమె గాగిన్ చెల్లెలు మాత్రం కాదని నాకు రూఢి అవుతోంది. అతనామెకిచ్చే చనువు మరీ మితిమీరినట్లు వారిద్దరి అనురక్తత హద్దులుమీరినట్లు కనిపించింది. మామూలు అన్నా చెల్లెళ్లలా మటుకు నా కెక్కడా కనిపించలేదు వారు.

ఒక విచిత్ర సంఘటన నాయీ అనుమానాన్ని మరీ బలపర్చింది.

ఓ రోజు సాయంత్రం గాగిన్ బంగ్లాకి వెళ్లాను. ఎప్పుడూ తాళంవేసి వుండని గేటు ఆనాడు తాళంవేసి వుంది. ఎందు

కనా అని ఆలోచించకుండా పక్కనే కంచెలో వున్న దారి గుండా తోటలోకి ప్రవేశించాను. ఆ పక్కనే అల్లంత దూరంలో అకేసియా తీగల మధ్య ఒక పొదరిల్లు వుంది. అందాకా వెళ్ళి అది దాటిపోతుండగా ఆస్యా కంఠస్వరం విని ఠ్రూన్నపశి నిలిచిపోయాను. గద్గదికమైన కంఠంతో ఆవేశపూరితంగా అంటోంది——

నువ్వు తప్ప నా కింకెవరూ అఖ్ఖర్లేదు - ఇంకెవర్నీ ప్రేమించలేను. నాకు నువ్వే కావాలి! నువ్వుంటేచాలు!"

"వూరుకో ఆస్యా. ఏమిటిది మరీ పిచ్చి పిల్లలా...? "నీమాట నమ్మననా నీ అభిప్రాయం?" అంటున్నాడు గాగిన్.

ఆ పొదరింటోంచే వినిపిస్తున్నాయ్ వారి మాటలు. తీగెల సందులోంచి ఇద్దరూ కనిపిస్తున్నారుకూడానూ, వాళ్ళు మటుకు నన్ను గమనించలేదు.

"నువ్వే! నువ్వే!" అంటూ ఆస్యా అతని గుండెలమీద పడి ఎక్కిళ్ళుపట్టి ఏడుస్తూ మెలికలు తిరిగిపోతోంది.

"అహా_అబ్బ-వూరుకోమరి!" అంటూ గాగిన్ ఆమె తల నిమురుతూ వూరడించాడు.

ఒకటి రెండు క్షణాలు కదల్లేక అలానే నిలబడిపోయి... అతి కష్టంమీద తేరుకున్నాను. అడుగు ముందుకు వెయ్యకూడదనిపించింది. వెంటనే వెనక్కు తిరిగి వచ్చిన దోవనే బైటపడి ఇంటికి పరుగెత్తుకెళ్ళాను. నా అనుమానాల్ని రూఢి పరిచిన ఆ కాకతాళీయ సన్నివేశం నాలో ఏదో పైశాచిక

తృప్తిని కలిగించినట్టుంది. చిరునవ్వు నవ్వుకుంటూ చేతులు నులుముకున్నాను. కాని నా హృదయం ఓమూల కుంగిపో తూనేవుంది. ఎంత భేషజం! ఎంత కపటం! ఎందుకు? ఎందు కింత నటన? నన్ను వెర్రివెధవను చెయ్యాల్సిన అవసరం ఏమిటి?...నిజంగా గాగిన్ ఇంతవాడని కల్లోకూడా అనుకో లేదు...ఎంత అమాయకంగా కనిపించాడు!

# 7

ఆరాత్రి ఎల్లాగో వేగించాను. తెల్లవారంగానే నా 'రక్ శాక్' బుజాన వేసుకుని ఇంటియజమానురాలితో సాయంత్రందాకా రానని చెప్పి ఏటివొడ్డునేపడి కొండల్లోకి వెళ్ళిపోయాను. హాన్డ్స్‌రాక్ (కుక్క-మూపు) అని పిలవ బడే పర్వతపంక్తిలో ఈ కొండలొక శ్రేణి. మృత్పాషాణ శాస్త్రజ్ఞులపాలిట సుక్షేత్రం. ముఖ్యంగా స్వచ్ఛమైన లావా రాళ్లు కుప్పతిప్పలుగా వుంటాయి ఇక్కడ. కాని నా మనసు మృత్పాషాణాలమీద లేదు అసలు దేనిమీదా నిలకడగా లేదనుకుంటాను గాని ఒక్క-'క్షిమటుకు ఖాయం-మళ్ళీ గాగిన్ ముఖం చూడదలుచుకోలేదు. నా యీ హఠాత్కోపానికి కారణం వాళ్ళ మోసమేనిని నచ్చజెప్పుకున్నాను. అసలు వాళ్ళిద్దరూ రక్త సంబంధులని నాతో చెప్పుకోమని ఎవరే డ్చారు? మిగతా గొడవలన్నీ నా మనసునుంచి దూరంగా

పారద్రోలాను. ఇష్టంవచ్చినట్టు కొండలూ లోయలూ ఎక్కి దిగాను. గ్రామీణ పానశాలల్లో విశ్రాంతి తీసుకున్నాను. అక్కడ అందరితోనూ కలిసిపోయి కులాసా కబుర్లు చెప్పుకున్నాను. నిర్మలాకాశంలో తేలిపోతున్న మేఘమాలనుచూస్తూ ఎండకి వెచ్చబడ్డ రాతిబండమీద వెల్లకలా పడుకున్నాను. మూడురోజులు మూడు నిముషాల్లా గడిపాను. అప్పుడప్పుడు మనసు కలుకుమంటున్నా నే తిరిగిన ప్రదేశాల్లోని ప్రశాంత ప్రకృతి దృశ్యాలు నా తాత్కాలిక భావానుగుణ్యంగానే వుంటంవల్ల హాయిగానే గడిచిపోయింది కాలం.

చిట్టడవుల్లోని గుగ్గిలపు వాసన, వడ్రంగి పిట్టల కూతలు, చిటుకు చిటుకున చెట్టుకొమ్మల్ని కొట్టేశబ్దాలు- తరళమైన సెలయేళ్ళ నిరంతర ఝర్ఝరీధ్వానం- అలల్లా తేలిపోతున్నట్లున్న సుదూరపర్వత పంక్తి - పరిశుభ్రమైన జనపదాలు - పురాతన పవిత్ర దేవాలయాలు - మహావృక్షాలు- విశాలమైన మైదానాలు - గిరుక తిరిగిపోయే నీటిమిల్లుల బృహచ్చక్రాలు - నీలిరంగు పాదరక్షలు - బూడిద వర్ణపు మేజోళ్ళు - అతి మందవేగంతో కిర్రుచప్పుడు చేసుకుంటూ దొర్లిపోయే బళ్ళు-గుర్రాలు-ఆవులు- ఎద్లు- ఆపిల్, పియర్ ఫలవృక్షాలమధ్య నున్నని రోడ్లమీద అనంతయాత్ర చేసే తీర్థప్రజలు... ఆ మూడురోజుల్లోనే కన్నవీ విన్నవీ అన్నీకలిసి ఒకటే భావంగా నా హృదయంలో హత్తుకుపోయాయి. ఆక్షణికమైన అనుభూతులకు నామనసు కైవశంచేశాను.

అవన్నీ జ్ఞాపకం చేసుకుంటూంటే ఈ నాటికికూడా నా హృదయం ఆనందతుందిలమై పోతుంది. స్వయం సమృద్ధులై సహనశీలురైన కష్టజీవుల సౌభాగ్యంతో విలసిల్లే జర్మన్ భూమాతా, నీకివే నా నమోవాకాలు! చల్లగావుండు తల్లీ! శాంతిభద్రతలతో తులతూగు తల్లీ!...

మూడోనాడు సాయంత్రానికి ఇంటికి చేరుకున్నాను. అన్నట్టు ఓ విషయం మర్చిపోయాను- గాగిన్లమీద కోపం కొద్దీ నా పూర్వప్రేయసి- ఆ వితంతువు స్వరూపాన్ని మళ్ళీ నా హృదయంలో ప్రతిష్ఠించుకుందామని ప్రయత్నించేను. కాని నా ప్రయత్నం నిష్ఫలమైపోయింది. ఓసారి ఆమెను మూర్తి గట్టుకోటానికి ప్రయత్నిస్తూండగా నాదృష్టి ఒక జర్మన్ పిల్లమీద పడింది. ఎవరో కృషీవలుల పిల్ల. గుండ్రని ముఖము- అమాయకంగా తేరిపారజూస్తూ వెలుగులు విర జిమ్మే కళ్ళు...నావంక పసితనపు నిష్కాపట్యంతో చూసింది... నిష్కల్మషమైన ఆమెచూపులుచూసి సిగ్గుతో తలవంచుకున్నాను. ఆమెసమక్షంలో అబద్ధమాడుకోలేకపోయాను. నన్ను నేనేవంచించుకోలేకపోయాను. తత్క్షణమే ఆవితంతువునిగురించిన సర్వాలోచనలూ వర్జించాను, శాశ్వతంగా!

ఇంటికొచ్చేసరికి గాగిన్ రాసిన వుత్తరం ఒకటి పడి వుంది. నా ఆకస్మికఅదృశ్యానికి ఆశ్చర్యపడుతూ తన్నుకూడా తీసుకుపోనందుకు తిట్టిపోశాడు. వచ్చినవెంటనే వాళ్ళ యింటికో సారి రమ్మనికూడా మరీమరీ వ్రాసాడందులో. ఉత్తరంవిసుక్కుంటూనే చదివానుగాని మర్నాడు ఉదయం మళ్ళీ 'ల...'కు బయలుదేరాను.

# 8

గాగిన్ సాదరంగానే ఆహ్వానించి లోపలికి తీసుకుపోతూ తల వాచేట్లు చివాట్లు పెట్టాడు. ఆస్యా నన్ను చూడగానే యథాప్రకారం పగలబడి నవ్వి లోపలికి పారిపోయింది. ఆస్యా నవ్వుకు గాగిన్‌కూడా కాస్త తెల్లబోయి "పిచ్చెక్కి వుంటుంది" అని గొణుక్కుంటూ "మీరేం అనుకోకండి బాబూ" అన్నాడు నాతో. అసలే ముళ్లమీద వున్నట్టున్నాను నేను. దానికితోడు ఆమె చపలచిత్తం, వికారచేష్టలూ నన్ను మరీ వికారపెట్టాయి. ఐనా ఏం ఎరగనట్టే మామూలుగానే ప్రవర్తించాను. నేనీ మూడురోజుల్లో తిరిగిన తిరుగుడూ చెప్పాను. గాగిన్‌కూడా నేలేనప్పుడు తను చేసిందంతా చెప్పాడు. కాని సంభాషణ సాగటంలేదు. ఆస్యా మళ్లీ లోపలికొచ్చి మళ్ళీ పరుగెత్తుకుపోయింది. చివరికి నేనే 'తొందర పనివుంది ఇంటికి వెళ్ళాల'ని లేచాను. ఇంకా కూర్చోపెట్టడానికి గాగిన్ కాసేపు ప్రయత్నించి, నావంక ఓసారి దీక్షగా చూసి- 'సరే పదండి-నేనూ మీ యింటిదాకా వచ్చి దిగబెట్టి వస్తా'నంటూ అతనూ లేచాడు. హాల్లో ఆస్యా మళ్ళీ ప్రత్యక్షమై తనచేయి జాపి నాకందించింది. నేనూ వినమ్రుడ నయ్యీ కాకుండా ఆమె వేలికొసలను మాత్రం స్పృశించి వదిలేశాను-

గాగిన్, నేనూ ఇద్దరం బల్లకట్టుమీద ఏరుదాటి అశోకవృక్షం కింద బల్లమీద కూర్చున్నాం-చుట్టూతా వున్న దృశ్యాన్ని పరికిస్తూ. మాయిద్దరికీ అప్పుడో అద్భుతమైన సంభాషణ జరిగింది.

ముందేం సంబంధంలేని మాటలు నోటికొచ్చినవి నాలుగు మాట్లాడుకున్నాం. తర్వాత ఇద్దరి నోళ్ళకూ తాళాలు పడి మెరిసిపోతున్న మహానదివంకే చూస్తూకూర్చుండిపోయాం. వున్నట్టుండి గాగిన్ మొహంమీద మందహాసం మోసులెత్తింది. అతనో ప్రశ్న వేశాడు-

"ఏమండీ-ఆస్యాని గురించి ఏమిటి మీ అభిప్రాయం? మనిషి చాలా విచిత్రంగా కనిపించి వుంటుంది మీకు"

"ఆఁ-? ఆఁ- అవును!"

నేనూ ముందు నిర్విణ్ణుడ నయ్యాను-ఆస్యా సంగతెత్తుతాడని నేనూహించనైనా లేదు.

అతనింకా అంటున్నాడు-

"దాన్నిగురించి ఏమైనా అనుకునే ముందు దాన్ని బాగా అర్థం చేసుకోవాలి-దాని హృదయం మటుకు చాలా మంచిదేగాని ఒట్టి పిచ్చిమొహం. దాంతో వేగటం కాస్త కష్టమేగాని దాని తప్పేంలేదు. దానికథ కనక తెలుసుకుంటే.."

"కథా-? ఆమె మీ...?"

గాగిన్ నావంక కనుకొలుకుల్లోంచి చూశాడు.

"అది నా చెల్లెలు కాదనుకొంటున్నారా యేమిటి ఖర్మం?" అంటూ నా గంద్రగోళం గమనించి మళ్ళీ అన్నాడు.

"అవును. అది నా చెల్లెలే. మా నాన్నగారి కూతురు. మిమ్మల్ని విశ్వసించవచ్చునని తోస్తుంది. అసలు కథంతా చెప్తాను వినండి—

"మా తండ్రి బాగా చదువుకున్నవాడు- విజ్ఞాని-దయా దాక్షిణ్యాలు గల మనిషి. కాని చాలా దురదృష్టవంతుడు కూడానూ. ప్రపంచంలో చాలామంది దురదృష్టవంతు లున్నారు. వాళ్ళకంటె ఎక్కువ బాధ పడకపోయినా- మొదటి దెబ్బకే తట్టుకోలేకపోయాడు. చిన్నతనంలోనే మా అమ్మని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. కాని వివాహమైన తర్వాత అచిరకాలంలోనే ఆరు నెలల పసిగుడ్డును నన్నీలోకంలో వది లేసి ఆమె మరణించింది. మా తండ్రి నన్ను తీసుకుని పల్లెటూరు వెళ్ళి పన్నెండేళ్ళు గడిపాడక్కడ. నా చదువూసంధ్యా అంతా ఆయనే స్వయంగా చూసేవాడు. ఓ సారి మా పినతండ్రి మా వూరు రాకపోతే నేనింకా అక్కడే వుండేవాణ్ణి. ఈయన పీటర్స్‌బర్గ్‌లో ఏదో ఉన్నతోద్యోగంలో వున్నాడు. నన్ను తనతో పంపించివేయమని పట్టుబట్టాడు. నా వయసు కుర్రా ళ్ళలా ఏకాంతంగా పల్లెటూళ్ళో పడి వుండటం మంచిదికాదనీ, సరైన చదువూ వాతావరణం లేక ఎందుకూ పనికిరాకుండా పోతాననీ శతపోరాడు. ముందు మానాన్న అంగీకరించలేదు గాని చివరికెలాగో ఒప్పుకున్నాడు. ఆయన దగ్గర శలవు తీసుకు వెళ్ళి పోతుంటే నాకు దుఃఖం ఆగిందికాదు. చిరునవ్వు అనేది ఆయన మొహంమీద నేనెప్పుడూ చూడకపోయినా ఆయ నంటే అంత అనుబంధం నాకు. పీటర్స్‌బర్గు చేరిన తర్వాత

తొందరగానే ఆ విషాదస్మృతులు మర్చిపోయాను. కొన్నాళ్లు ఆఫీసర్స్ ట్రెయినింగ్ స్కూల్లో చదివి వెంటనే ఒక గార్డ్స్ రెజిమెంట్‌లో జేరాను. ప్రతి యేటా ఒకటి రెండు వారాలు శలవు తీసుకుని నాన్నగారి దగ్గర గడుపుతూండేవాణ్ణి. కాని ఆయేటి కాయేడు ఆయనలో విచారం ఎక్కువైంది. ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. మరీ ఒంటరిగాడై పోయాడు. ఏదో ఆలోచిస్తూ ఎక్కడో చూస్తూ వుండేవాడు. అసలు మాటలాడే అలవాటే తప్పిపోయిందాయనకి. రోజూ చర్చికి మటుకు తప్పకుండా వెళ్ళి వచ్చేవాడు.

"అలా ఓసారి శలవుల్లో వెళ్ళినప్పుడు పదేళ్ళపిల్ల నొకతెను చూశాను మాయింట్లో. అదే ఆస్యా. ఎవరో దిక్కులేని పిల్ల అనీ దాని పోషకభారం తాను వహించాననీ చెప్పాడు మా నాన్న. నేనూ పెద్దగా పట్టించుకోలేదు. దానికికూడా అమితమైన సిగ్గు-ఎవళ్ళతోనూ మాట్లాడేదికాదు. మా నాన్న గదిలోకి నేవెళ్ళినప్పుడల్లా ఆస్యా ఏ టేబులు వెనకో బీరువా చాటునో ఆయన కుర్చీవెనకనో దాక్కునేది. ఆ తర్వాత మిలిటరీ డ్యూటీ మూలంగా వరసగా మూడునాలు గేళ్ళు మా వూరు వెళ్ళలేకపోయాను. ప్రతీనెలా ఓచిన్న వుత్తరం రాస్తూండేవాడు మానాన్న. ఆస్యా సంగతేం ఎత్తేవాడు కాదందులో. ఎత్తినా చాలాతక్కువ. ఏభై యేళ్ళు దాటినా, మంచి దేహదార్ఢ్యంగల మనిషి. ముప్ఫైయేళ్ళ మనిషిలా వుండేవాడు. అలాంటప్పుడు మా నాన్నకు చాలా ప్రమాదంగా వుందనీ ప్రాణాలతో ఆయన్ని చూడాలనివుంటే వెంటనే బయల్దేరి

రమ్మనీ మా స్టీవర్డు రాసిన వుత్తరంచూస్తే నాకెలావుంటుందో ఆలోచించండి. పరుగెత్తుకుంటూ మావూరు వెళ్ళి ఆయన్ని చూశాను. కాని కొనవూపిరితో వున్నారు. నన్ను చూసి మహా దానంద పడ్డాడు. చిక్కి, పాలిపోయిన చేతుల్తో నీరసంగా నన్ను కౌగిలించుకున్నాడు. దేనికోసమో బ్రతిమిలాడుతు న్నట్టు చాలాసేపు నా కళ్ళల్లోకి పరీక్షగా చూసి తన ఆఖరి కోరిక నెరవేరుస్తానని నాదగ్గిర వాగ్దానం తీసుకుని, ఆస్యాని తీసుకురమ్మని పక్కనేవున్న ముసలి సేవకుణ్ణి పంపించాడు. అతనువెళ్లి ఆమెను లోపలికి తీసుకొచ్చాడు. ఆస్యా అసలు నుంచోలేనట్టుంది. నిలువెల్లా తీవ్రంగా కంపించిపోతోంది.

అతి కష్టంమీద "ఇదిగో బాబూ- నీకప్పగిస్తున్నాను. నాకూతురు- నీచెల్లెలు. వివరాలన్నీ యకోవ్ చెప్తాడు." అన్నారు నాన్నగారు. ఆస్యా ఇక భరించలేక ఆయన మంచం మీదపడి భోరున ఏడవసాగింది... అరగంటతర్వాత మానాన్న మమ్మల్ని వీడిపోయాడు.

తర్వాత యకోవ్ చెప్పాడు- మా అమ్మ బ్రతికి వుండగా ఆమెదగ్గర తాత్యానా అనే దాసీమనిషి వుండేది. తాత్యానా నాకు బాగా జ్ఞాపకం. సన్నగా పొడుగ్గావుండేది. మొహం ఎప్పుడూ కళకళ్ళాడుతూ వుండేది. నల్లని విశాలమైన కళ్ళు...చాలా బాగుండేవి. యకోవ్ చెప్పినదాన్ని బట్టి మాఅమ్మ చనిపోయిన తర్వాత నాలుగైదేళ్ళకు మానాన్న ఈమెతో సంబంధం ఏర్పరుచుకున్నాడని తెలుసుకున్నాను. మాఅమ్మ పోయినదగ్గర్నుంచి తాత్యానా మాయింట్లోవుంటం మానేసి వాళ్ళ చెల్లెలితో వుండేది.

"నేను పీటర్స్‌బర్గ్ వచ్చేసినతర్వాత ఆమెను పెళ్ళి కూడా చేసుకుంటానన్నాడు కాని ఎంత బతిమాలినా ఆమె ఒప్పుకోలేదట.

"యకోవ్ సగర్వంగా చెప్పాడు- 'తాత్యానా వ్లా స్యేవ్నా చాలా మంచిదిబాబూ. మీతండ్రిగారి మర్యాద పాడుచేయడానికామె ఇష్టపడలేదు.

'నేనేంభార్యనండీ మీకు-ఆఖరికి నాపుట్టకైనా మంచిది కాదు' అనేది.

"తాత్యానా మాయింటికి వచ్చి వుంటానికూడా అంగీకరించక తనచెల్లెలు పాకలోనేవుంది ఆస్యాను పెట్టుకుని. మా పిన్నాన్న నన్ను తీసుకెళ్ళేటప్పటికి ఆస్యాకి రెండేళ్లు. ఎనిమిదేళ్ళు వచ్చేసరికి తల్లిలేనిపిల్ల అయిపోయింది.

"తాత్యానా చనిపోగానే మా నాన్న ఆస్యాన్ని మా యింటికి తీసుకొచ్చేశాడు. అంతకుముందే తనదగ్గర వుంచు కుంటానంటే తాత్యానా ఒప్పుకోలేదు. ఆ భవనంలో అడుగు పెట్టాక ఆస్యా మనసెలా వుంటుందో మీరే వూహించుకోండి. మొట్టమొదటిసారిగా విలువగల సిల్కుబట్టలు వేసుకుని సేవకు లంతా వచ్చి దణ్ణం పెట్టి చెయ్యి ముద్దుపెట్టుకున్న రోజు ఈనాటికూడా మర్చిపోలేదు, ఆస్యా. చక్కని క్రమశిక్షణలో పెంచింది దాన్ని తల్లి. నా తండ్రి యింట్లో దానికి సంపూర్ణ స్వాతంత్ర్యం. ఆయన దానికి గురువు-దైవం-తోడునీడ అన్నీ ఆయనే. అతిగారాబంచేసి పాడుచేయలేదు గాని అమితంగా ప్రేమించాడు దాన్ని. దాని కెదురుచెప్పేవాడు కాదు. దాని

పట్ల తానేదో ద్రోహం చేసినట్లు మనసులో బాధ పడేవాడు. ఆ యింట్లోకల్లా అగ్రస్థానం తన దేనని ఆస్యా త్వరగానే గ్రహించింది. కాని తన స్థానం కపటమైందనికూడా గ్రహించింది. దాంతో ఒక విధమైన దురహంకారము, భయము మనస్సులో కలిగాయి. దురలవాట్లు మొదలయ్యాయి. అమాయకత్వం అదృశ్యమైంది. తన జన్మవిషయం సర్వప్రపంచమూ మర్చిపోయేట్లు చేయడమే తన ఆదర్శమని నాతో ఓసారి అంది. తన తల్లిని తలుచుకుని ఓవంక సిగ్గుపడుతూనే ఓవంక గర్విస్తూండేది.

"అవును మరి–వయసుకు మించిన విషయాలనేకం విన్నది–కన్నది...కాని అది దానితప్పా? తన నవనవోన్మేషమైన వయస్సు–ఉత్సాహం–కవోష్ణరక్తం అమె నరాల్లో పరవళ్లు తొక్కింది. అవును కాదని చెప్పేవాళ్లులేరు. ప్రతి విషయంలోనూ సంపూర్ణమైన స్వేచ్ఛ! కాస్తాకూస్తా బరువా అది? కాని తోటి యువకులతో బాటు సరితూగాలని నిశ్చయించుకుంది. ఆశతో చదువుల్లోకి ఉరికింది. కాని ఎన్ని తంటాలుపడ్డా రాగల సత్ఫలితం ఏమిటి? ఆదిలోనే హంసపాదుతో ప్రారంభమైన దానిజీవితం పొడుగునా అడ్డంకులే. కాని దాని హృదయంమాత్రం మచ్చగట్టలేదు–దానిమనసు మలినంకాలేదు.

"పాతికేళ్ళైనారాని కుర్రవెధవని నేను–నా చేతుల్లో పదమూడేళ్ళ పిల్ల! మానాన్న పోయిన కొత్తల్లో నా గొంతు వింటేచాలు దానికి జ్వరమొచ్చినంత పనయ్యేది. నే దగ్గిరకితీస్తే చిత్రహింసలా వుండేది. కొన్నాళ్ళకుగాని మాలిమి కాలేదు. తర్వాత తర్వాత నేను తన్ను నిజంగా నా చెల్లెలు

లాగానే చూసుకుంటున్నానని అర్థంఅయిన తర్వాత ఇహ నన్ను వదిలి వుండేదికాదు. దాని విషయంలో మటుకు సగమెరికలు లేవు.

"తర్వాత పీటర్స్‌బర్గు తీసుకెళ్లాను. అస్యాని వదిలిపెట్టడ మంటే ఎంతో బాధగాతోచినా దాన్ని నాకూడా అట్టేపెట్టు కోవడం అసంభవం. అందుకని ఒక బోర్డింగ్‌స్కూల్లో జేర్పిం చాల్సివచ్చింది. ఆస్యాకూడా పరిస్థితి అర్థంచేసుకుని స్కూల్లో జేరింది. ఆ స్కూల్లో నాలుగేళ్ళు గడిపివచ్చినా మనిషి ఒక్క పిసరుకూడా మారలేదు. పాఠశాల ప్రధానోపాధ్యాయురాలు ఎప్పుడూ ఏదో నేరం చెప్తూనేవుండేది. 'దాన్ని శిక్షించీ లాభం లేదు-లాలించీలాభంలేదు'అనేది. కాని ఆస్యా చాలా తెలివిగల పిల్ల అనిపించుకుంది. క్లాసులో ఫస్టు. మొండితనం చిఱచిఱ లాడటంకూడా వాటితోబాటే అభివృద్ధిచెందాయి... కాని అందుకు దాన్నేమీఅనలేను నేను. దాని పరిస్థితిలో లొంగు బాటుకుగాని తిరుగుబాటుకుగాని సావకాశంలేదు. బళ్లోవున్న పిల్లలందర్లోకీ అది స్నేహంచేసిందల్లా ఒక అతి బీదపిల్ల తోనే. కులీనులైన పిల్లలెవరికీ అదంటే పడేదికాదు. చేతనైన నంతవరకూ దానిమీద కట్టుగట్టి దానిమనసు గాయపరచే వారు. ఐనా వాళ్లకొక్క వీసమెత్తైనా లొంగేదికాదు. ఓసారి బళ్లో పంతులమ్మ దురలవాట్లనిగురించి పాఠం చెప్తుంటే ఆస్యాలేచి ముఖస్తుతి, పిఱికితనం పెద్ద దురలవాట్లందట. కొసకి-తను బయల్దేరినదోవలోనే వుందన్నమాట.

"పదిహేడో యేడు కూడా వచ్చింది. ఇంకెన్నాళ్ళు వుంటుంది స్కూల్లో? నా పరిస్థితి చిక్కైపోయింది. అంతలో నాకో మంచి ఆలోచన వచ్చింది. సర్వీస్‌లోంచి రిటైరైపోయి ఒకటి రెండేళ్ళపాటు ఆస్యానుకూడా తీసుకుని విదేశయాత్ర చేసి వద్దామనిపించింది. అనిపించగానే అమలు పరిచేశాను. ఫలితం-ఈనాడు ఇద్దరమూ ఇక్కడ ఈ రైన్ నదీతీరాన నేను నా చిత్రరచనతోనూ, అది దాని మామూలు ఉన్మాదంతో వెఱ్ఱిగానూ కాలక్షేపం చేస్తున్నాం.

"ఇప్పుడు మీరు ఆస్యాని కాస్త విశాల దృక్పథంతో చూసి పరీక్షకు నిలబెట్టండి. అది ఎన్ని పోజులు పెట్టినా ఎంత గాంభీర్యం నటించినా ఎదటివాళ్ళ అభిప్రాయాలకు విలువ యిస్తుంది-ముఖ్యంగా మీ అభిప్రాయాలకు!"

అని గాగిన్ మందహాసం చేస్తూ ముగించాడు. నేనతని చెయ్యి పట్టుకుని గట్టిగా అదిమాను.

గాగిన్ మళ్లీ అసలు విషయానికి వచ్చాడు-

"అదంతా ఫరవాలేదండీ-కాని దాంతో వచ్చిన చిక్కేమిటంటే అదో మందుగుండుసామాను. ఇంతవరకూ ఎవళ్ళూ లేరుగాని అది ఎవరైనా ప్రేమిస్తే?...అప్పుడేమౌతుందా అని అలా ఆలోచిస్తూ కూర్చుంటాగా నొక్కోసారి. మొన్ననో రోజేంచేసిందో తెలుసా? ముందు నాకు తనమీద ప్రేమ పోయిందంది. తనుమటుకు నన్నుతప్ప ఇంకెవర్నీ ప్రేమించదట-జీవితాంతంవరకూనూ!... అబ్బ-ఏం ఏడ్చింది-ఎంత ఆవేశపడింది!"

"ఓ! ఐతే ఆ–" నోరుజారి వచ్చేసిందిగాని వెంటనే సర్దుకున్నాను–(ఇద్దరంకూడా నిష్కల్మషంగా మాట్లాడుకుంటున్నాం ఇప్పుడు-)

"అంటే మీ వుద్దేశం...ఇంతవరకూ ఆమెకు నచ్చిన మనిషే కనిపించలేదంటారా?.. పీటర్స్‌బర్గులో, బోలెడు మందితో పరిచయం కలిగేవుంటుంది..."

"ఎబ్బే. ఎవళ్ళూ నచ్చలేదు. దానికి, ఉఁ హుఁ–ఆస్యాకి అసామాన్యమైన వ్యక్తి- హీరో అంటాం చూడండి- అలాంటి వాడుగానీ లేకపోతే ఏ గ్రహాంతర సీమల్లోనో ముచ్చటగా గొఱ్ఱెలుకాచుకుంటూ కూర్చునేవాడో కావాలి. అయ్యయ్యో క్షమించండి. మిమ్మల్ని చాలాసేపు కూర్చోబెట్టేసట్టున్నాను మాటల్లో పడి!"అన్నాడు గాగిన్ లేస్తూ. నేనూ లేచి అతని చెయ్యి పట్టుకు ఆపాను-

"ఆఁ...చూడండి-నేనింటికి వెళ్ళను. ఇద్దరం కలిసే వెళ్దాం పదండి."

"మరి మీరేదో పనుందన్నారు?" నేనేం సమాధానం ఇవ్వలేదు. గాగిన్ సరదాగా చిరునవ్వు నవ్వాడు. ఇద్దరం మళ్ళీ 'ల...' గ్రామాభిముఖులమైనాము. సుపరిచితమైన ఆ ద్రాక్షతోట, కొండమీద బంగళా కనిపించంగానే నాలో ఒక మధురమైన–అవును నా హృదయంలో తేనెలసోనలు వర్షిస్తున్నట్టు మధురమైన భావన అనుభూతికి వచ్చింది.

గాగిన్‌కథ విన్నప్పట్నుంచీ కూడా చాలా తేలికపడింది నా మనసు.

# 9

ఆస్యా గుమ్మంలోనే కలుసుకుంది మమ్మల్ని. మళ్ళీ విరగబడి నవ్వుతుందేమోనని అందుకూడా సిద్ధపడ్డాను గాని ఆమె చూపులు నేలకువాల్చి నిశ్శబ్దంగా మావైపుకువచ్చింది.

“ఆయన మళ్ళావచ్చారు. నే నేంతీసుకురాలేదుసుమీ! ఆయనంతట ఆయనే వచ్చారు!” అన్నాడు గాగిన్.

ఆస్యానావంక ప్రశ్నార్థకంగా చూసింది. ఈసారి నేనే చేయిజాపి ఆమెచేయి అందుకుని కాస్త చల్లగా వున్న ఆమె వేళ్ళను మృదువుగా నొక్కాను. ఆమెపై నాకమితమైన జాలి వేసింది. ఇన్నాళ్ళూ నాకర్థంకాక నన్ను బాధపెట్టిన సమస్య ఇట్టే విడిపోయింది, ఆమె చాంచల్యం-సభ్యతతో ప్రవర్తించలేకపోవడం-విరగబాటు ప్రయత్నం-అన్నీ తేటతెల్లంగా అవగతమయ్యాయి నాకు. ఆమె మనసులోకి-హృదయ కుహరంలోకి తొంగిచూశాను. ఏదో రహస్యమైన ప్రేరణ ఆమెను నిరంతరం ముందుకు నెట్టుతోంది. ఇంకా పరిపక్వ దశకు రాని అహంకారం ఆమెకు శాంతి నివ్వటంలేదు. కాని సత్యంకోసం తన సర్వశక్తులూ వినియోగిస్తోంది. ఆమెలో నన్నాకర్షిస్తున్న విశేషమేమిటో ఆనాడుగాని నాకు గోచరించలేదు. నేను ప్రేమి

స్తున్నది ఆలతాంగి లావణ్యం కాదు-ఆమె హృదయాన్ని-ఆమె మనస్సుని !

గాగిక్ తనపాత డ్రాయింగ్ కాగితాలన్నీ తిరగేస్తూ కూర్చున్నాడు. అలా ద్రాక్షతోటలో కాస్త తిరిగివద్దామా అని ఆస్యాతో అన్నాను. "ఓ !" అని వెంటనే ఒప్పేసుకుంది. స్లోపున సహందూరం నడిచాక ఓ పెద్ద రాతిబండమీద కూర్చున్నాం.

"మేం క్షేమంగా మీకసలు తోచిందా ?" అని అడిగింది ఆస్యా. "మీకు ?" అని నేను ప్రతిప్రశ్న వేశాను.

ఆస్యా నావైపు ఓరగా చూసింది-

"మాకుమటుకేం తోచలేదు... ఆ కొండలూ అవ్వీ... అక్కడ బాగుందా ? చాలా ఎత్తైనవా అవ్వి ? మేఘాలకంటేనా ? ఇంకా అక్కడ మీరేం చూశారు. చెప్పండి-మా అన్నతో చెప్పారుగాని నేనేం విననేలేదు."

"నువ్వేగా లేచి వెళ్ళిపోయావ్."

"అప్పుడు...ఎందుకంటే...ఇప్పుడు అడుగుతున్నాగా చెప్పరాదూ ? ఎందుకంత పెడసరంగా వుంటారు మీరు ?"

"నేనా-పెడసరంగానా ?"

"అవును మీరే."

"ఎందుకు-ఎందుకుండాలి నేను పెడసరంగా ?"

"ఏమోమరి. ఇందాక వచ్చినప్పుడూ అలాగేవచ్చారు. వెళ్ళిపోయేటప్పుడూ పెడసరంగానే వెళ్ళిపోయారు. అలా వెళ్లి

పోయినందుకు నాకెంత బాధ అనిపించిందనుకున్నారు! మీరు మళ్ళీ వచ్చినందుకు చాలా సంతోషంగా వుంది."

"నాకూ సంతోషంగానే వుంది."

సంతోషంకొద్దీ చిన్నపిల్ల లెగరేసినట్లు ఆస్యా భుజాలెగరేసింది.

"ఎదటివాళ్ళ మనస్సులో ఏంవుందీ నే చెప్పగలను–ఎందుకూ–పక్కగదిలో మానాన్న దగ్గిరదగ్గునుబట్టి పోల్చుకో గలిగేదాన్ని, ఆయన నామీద కోపంగా వున్నారో లేదో!"

ఇప్పటిదాకా ఆస్యా ఎన్నడూ తనతండ్రి పేరెత్తలేదు నా దగ్గర. నా మనస్సెలాగో ఐపోయింది.

"మీ నాన్నంటే నీకు ప్రేమేనా?" తపీమని అడిగేశాను. అడిగి సిగ్గుపడ్డట్టు తెలిసి మరీ చచ్చిపోయ్యాను.

ఆస్యా సమాధానం ఇవ్వలేదు. ఆమె ముఖంకూడా ఎఱ్ఱబారింది. ఇద్దరం దూరాన రైన్‌నదిలో ధూమ మేఘాల్ని వదిలిపెడుతూ పోతున్న స్టీమరువంక చూస్తూ నిశ్శబ్దంగా కూర్చున్నాం కొంతసేపు.

"ఆ కొండల్ని గురించి చెప్పరేం?" అంది ఆస్యా అస్పష్టమైన కంఠస్వరంతో.

"ఇవ్వాళ నన్ను చూడంగానే ఎందుకలా నవ్వావ్?" అనడిగాను నేను.

"ఏమో నాకే తెలీదు. ఒక్కోసారి నిజంగా ఏడవాలనిపించినప్పుడు నవ్వొస్తూంటూంది నాకు. మీరు...మీరు

నే చేసే పన్లని ఆట్టే పట్టించుకోరాదు. ఆం- అన్నట్టు 'లారెలీ' గాథ ఎంత బాావుందండీ! ముందు ప్రతివాళ్ళనీ నదిలోకి తోసేసేదట. కాని ఆమె ఎవరినో ప్రేమించాక తానే నదిలో దూకి మునిగిపోయిందట! అదుగో- ఆ రాతిమీాదనుంచే! ఆ కథ చాలా బావుందినాకు. ఫ్రాలూాయీా రకరకాల కథలు చెప్తూంటుంది. ఆవిడదగ్గిర నల్లటి పిల్లి ఒకటుంది. పసుపురంగు కళ్ళూ అదీ..."

ఆస్యా తలయెత్తి ఉంగరాలు తిరిగిన జుత్తు ఒక్కసారి వెనక్కు విదిలించుకుంది—

"అబ్బ-ఎంత ఆనందంగా వుంది నాకిప్పుడు!"

దూరంగా కొండదిగువన ఎవరో తీర్థప్రజలు ప్రభలు కట్టుకుని గుంపుగా ఎక్కడికో పోతున్నారు. అందరూ కలిసి గొంతెత్తి పాడుతున్న భజనకీర్తనలు ఆలాప మాత్రంగా మా చెవుల్లో పడ్డాయి.

అంతకంతకూ దూరమవుతున్న ఆ పాట విందామని చెవులు రిక్కిస్తూ ఆస్యా అంది-"వాళ్ళతో పడిపోతే బాగుణ్ణు."

ఏం? అంతభక్తి పుట్టుకొస్తోందా?"

"దూరంగా ... బహుదూరంగా వెళ్ళిపోయి ఒక దుస్సాధ్య కార్యసాధన కోసం తపస్సు చేయాలని వుంది. రోజులు గడచిపోతున్నాయి. జీవితం పరుగెత్తుతూంది. ఏం సాధించాం చెప్పండింతవరకూ?"

"ఓ! ఆదర్శవాదివన్నమాట నీవు! జీవితం వృథా కాకుండా ఏదో సాధించి నీ అనంతరం..."

"అదంతా అసంభవమంటారా ?" అసంభవమేనని నా పెదవులనబోయాయిగాని మెరిసిపోతున్న ఆమె కళ్ళల్లోకి చూసి 'ప్రయత్నించు' అన్నాను.

ఆస్యా ఒక్క క్షణం ఆగింది. ఆలోచనచ్ఛాయలు ఒక్కసారి ఒకదానికొకటి గిరువన తిరిగిపోయి, మళ్ళీ ఆమె ముఖం వివర్ణమైంది.

"ఏమండీ - ఆవిడని మీరంత ప్రేమించారా?...ఆ శిథిలదుర్గం దగ్గర మా అన్నయ్య అన్నాడే! ఆవిడ!"

నాకు నవ్వొచ్చింది.

"మీ అన్నయ్య వేళాకోళం ఆడేడు. నేనెన్నడూ ఏ స్త్రీనీ ప్రేమించలేదు". అమాయక కుతూహలంతో ఆస్యా తల వెనక్కు విసిరి మళ్ళీ అడిగింది—

"అసలాడవాళ్ళల్లో మీరేమిటి ప్రేమిస్తారు?"

"ఏం విచిత్రమైన ప్రశ్న ?"

ఆస్యా తత్తరపడింది.

"నేనలాంటి ప్రశ్నలడగరాదు కదూ ? క్షమించండి. బుర్రకి తట్టింది బైటికి రాకుండా వుండదు నాకు. అందుకే నాకసలు మాట్లాడటమంటేనే భయం."

"అదే పనికిరాదు ఆస్యా, మాట్లాడు. ఇన్నాళ్ళకైనా నీకు బిడియం వదిలిందని సంతోషిస్తున్నాను."

ఆస్యా తలవంచుకుని మెల్లగా చిన్నగా గువ్వలా నవ్వింది. ఆమె అలా నవ్వడం నేనెన్నడూ వినలేదు. ఇంకా

చాలాసేపు కూర్చుందామన్నట్టు కాళ్లమీద గౌను ముడతలు సర్దుకుంటూ అంది—

"మీరే ఏమైనా మాట్లాడండి. లేకపోతే ఏదైనా పాడండి - అప్పుడెప్పుడో ఓసారి పుష్కిన్ పాటలుపాడి విని పించారు .." వెంటనే ఆగిపోయి గొంతెత్తకుండా సన్నగా ఆలపించింది ఆస్యా—

ఎక్కడమ్మా శిలు వెక్కడమ్మా
ఖేద పరితప్త హృదయ
నా మాతృదేవి సమాధిపై
తరుశాఖల నీడ లెక్కడమ్మా...

"పుష్కిన్ రాసింది అది కాదు" అన్నాన్నేను.

"నేనే తాత్యానా నైతే ఎంత బాగుండేది!" అంది ఆస్యా విషాదభారంతో "ఊఁ కానీండి మరి" అంది మళ్లీ.

కాని నేను మాట్లాడే పరిస్థితిలో లేను. ప్రశాంతంగా విశ్రమంగా ఆ నునువెచ్చని ఎండలో వెలిగిపోతున్న ఆమెవంకే చూస్తూ కూర్చుండిపోయాను. మాక్రిందా పైనా, నేల, ఆకాశం, మహానదీ అన్నీ ప్రకాశించిపోతున్నాయి. వాతా వరణం అంతాకూడా అతిశోభాయమానంగా వుంది.

"అంతా ఎంత దివ్యంగా వుందో చూడు!" అన్నాను.

దివ్యం! మనమే కనక పక్షులమైతే ఆ అనంతవిశ్వం లోకి ఎంత ఎత్తుకు ఎగురుతాం! ఎంతదూరం దూసుకుపోతాం! కాని మనం పక్షులం కాదు - మనకు రెక్కలులేవు!"

"మనమూ రెక్కలు తెచ్చుకోవచ్చు."

"ఎలా ?"

"చూడటం-చూసి నేర్చుకోవడం! మనల్ని అమాంతం ఈ భూతలంమీదనుంచి ఎత్తి పారేసే భావాలెన్నో వున్నాయి. మరేం ఫరవాలేదు, విచారించకు - నీకూ ఓ రోజు రెక్కలొస్తాయి."

"మీరెప్పుడైనా అలా ఎగిరిపోయారా ?"

"ఊఁ...అలా చెప్పటమంటే కష్టం...ఉఁహుఁ-నే నెప్పుడూ అలా ఎగిరిపోలేదనుకుంటాను." ఆస్యా మళ్లీ కాస్సేపు మౌనంగా వుంది. నే నామెవైపు వంగాను.

"మీకు వాల్ట్జ వచ్చునా ?" అని అడిగింది వున్నట్టుండి.

నేను విస్తుపోయి వచ్చునన్నాను.

"ఐతే లేచిరండి. మా అన్నయ్యని వాల్ట్జ వాయించమని అడుగుతాను. మనిద్దరం నాట్యంచేస్తూ ఎగిరిపోతున్నామనుకుందాం-మనకి రెక్కలొచ్చాయనుకుందాం - కాస్సేపు రండి."

అంటూనే లేచి ఇంటివైపు పరుగెత్తింది. నేనూ ఆమె ననుసరించి వెళ్ళాను. కొద్దినిమిషాల తర్వాత మృదుమధురమైన వాల్ట్జ సంగీతానికి అనుగుణంగా ఆ ఇరుకుపాటి హాల్లో వాల్ట్జ నాట్యం చేస్తున్నాం ఇద్దరం. ఆస్యా అతి ఉత్సాహంతో చాలాబాగా నాట్యం చేసింది. ఆ కన్నెపిల్ల ఉగ్రస్వరూపం లోంచి మృదులాతి మృదులమైన స్త్రీ భావమేదో ఉద్భవించి

గోచరించింది. ఆమె సన్నని నడుముకి ఆలంబంగా వున్న నా చేయి ఆమె స్పర్శసుఖం చాలాసేపు అనుభవించింది. అతి చేరువలో వున్న ఆమె యౌవనపు వొంపులు తిరిగిన ముంగురులమధ్య తీర్చిదిద్దినట్లున్న ఆమె విషణ్ణ ముఖంలో నిశ్చలాలై అర్ధనిమీలితాలైన ఆమె నల్లని కళ్లు నేనెప్పటికీ మర్చిపోలేను.

# 10

ఆరోజంతా కూడా మధురాతిమధురంగా గడిచిపోయింది. చిన్నపిల్లల్లా త్రుళ్ళిపడుతూ కేరింతాలు కొట్టాం. ఆస్య అతి నిరాడంబరంగా అతిఉల్లాసంగా వుంది. గాగిన్ కూడా ఆమె అలా వుండటంచూసి ప్రహర్షణ భరితుడయ్యాడు. నేను వాళ్ళ దగ్గర శలవుతీసుకుని ఇవతలపడేసరికి చాలా పొద్దుపోయింది. బల్లకట్టు ఏట్లో సగందూరం పోయాక వాలున వదిలెయ్యమన్నాను. బల్లకట్టుమనిషి-ముసలి-తెడ్లు వెయ్యడం ఆపేశాడు. రాజసం వెల్లివిరుస్తున్న మహానది మమ్మల్ని తన వక్షస్థలంమీద మోసుకుపోయింది. దేనికోసమో వింటూ, ఏమిటో జ్ఞాపకం చేసుకుంటూ చుట్టూకలయజూశాన్నేను. హఠాత్తుగా ఏదో రహస్యమైన ఆముద్రా నా హృదయంలో మెదిలింది. మొహమెత్తి ఆకాశంవంక చూశాను. కోటినక్షత్రాల్ని పొదివికొని సర్వదా విచలిస్తూ కొట్టుమిట్టాడుతోంది. అక్కడా

శాంతిలేను. నీళ్ళల్లోకి వంగి చూశాను...అక్కడకూడా ఆ అగాధపు గోతుల్లో నక్షత్రాలు ప్రతిఫలించి ప్రచలిస్తున్నాయి. ఎక్కడచూసినా అపరిమానమైన ఆదుర్దా ఆత్రుతా ప్రత్యక్షం కాసాగాయి. నాలోనూ అవి పెరిగి పెద్దవి కాసాగాయి. జల్ల కట్టుకు జేరగిలబడి తలవాల్చుకు కూర్చున్నాను...చల్లని పిల్ల తెమ్మెరలు-నా చెవుల్లో ఆడుతున్న గుసగుసలు-చుక్కాని చుట్టూ వడివడిగా సుడులుతిరిగిపోతున్న నీరు చేసే జల జల ధ్వానం నన్ను కలవరపరచసాగాయి. కెరటాలు ఎగిరిపోస్తున్న చల్లదనం నన్నూరడించలేకపోయింది. ఒడ్డున ఎక్కడో కూస్తున్న కోయిల పాటలోని మధుర విషం నా నరనరాల్లోకీ ఎక్కిపోయింది. నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి- అనిర్దిష్టమైన పారవశ్యంతో కాదు-మనస్సు విశాలంచేసి ఎలుగెత్తి వడించి భగవత్సృష్టి అంతా ప్రేమమయమని అనిపించే విశ్వజనీనమైన ప్రేమ భావంతో కాదు-అవును! కాదు. ఇప్పుడు నన్ను దహించివేస్తున్నది సుఖ దాహం! అదేమిటో ఫలానా అని ఇంకా నే చెప్పలేను కాని నే కోరుతున్నది మాటుకు ఆనందం — సౌఖ్యం! పొంగిపొరలే సౌఖ్యం!......

# 11

మర్నాడు గాగిన్ ఇంటికి బయలుదేరేటప్పుడు నే నాస్యాని ప్రేమిస్తున్నా నన్న ప్రశ్నే నాలో ఉదయించలేదు. కాని ఆమెనుగురించే చాలా ఆలోచించాను. ఆమె గతి నన్ను కుతూహలపరచింది. ఇద్దరం కాస్త దగ్గరైనందుకు సంతోషం వేసిందకూడానూ. అంతవరకూ ఎప్పుడు నన్నుచూసినా మొహం తప్పించడమేగదా. అసలు ఆస్యాకూ నాకూ ఆ కిం దటిరోజునుంచే పరిచయం అనిపించింది. ఇప్పుడు నాలో మూర్తి కట్టుకున్న ఆస్యా బొమ్మ ఎంత సమ్మోహనకరమైన దీప్తిని వెదజిమ్ముతోంది! ఆ బొమ్మ నాకెంత కొత్తగా నిత్య నూతనంగా వుంది! ఆ బొమ్మ అంతరాంతరాల్లో ఎంత లజ్జా సంభరితమైన లావణ్యపుంజం నిబిడీకృతమైవుంది!

బంగ్లా కంటబడ్డదగ్గర్నుంచీ చూపులు మరల్చుకో కుండా దానివంకే చూస్తూ గబగబా కొండఎక్కాను. భవిష్యత్తుసంగతలా వుంచండి- రేపు తెల్లారిన తర్వాతసంగతి కూడా నా మనసులో లేదు-అంత సంతృప్తిగావుంది నా మనసు.

నేను హాల్లోకి అడుగు పెట్టగానే ఆస్యా కపోలాలు కెంపెక్కాయి. అప్పుడే మనిషి వేషం మారింది. కడిగిన

ముత్యంలా తయారైంది. కాని ముఖంలోమాత్రం ఏదో విచారభావం కనిపిస్తోంది. అమితోత్సాహంతో వచ్చిన నా గుండెల్లో రాయిపడ్డట్లయింది. వెనకటిలాగే గిఱ్ఱున వెనక్కి తిరిగి పారిపోతుందేమో ననికూడా అనిపించిందిగాని అతి ప్రయత్నంమీద నిలబడ గలిగింది. గాగిన్ అసలీ ప్రపంచంలోనే వున్నట్టు లేడు - సర్వం విస్మరించినట్టు అతి తీవ్రతతో ఏదో బొమ్మ గీస్తున్నాడు. ప్రకృతి జుట్టు తన చేతిలో చిక్కినట్లు చేతిలో ఒక బ్రష్ పట్టుకుని కాన్వాసుముందు నిలబడ్డాడు. తలంతా చెదిరిపోయి ఒళ్ళూ మొహం రంగుమరకలతో నిండి పోయింది. ఒక్క తల ఆడింపుతో నన్ను పలకరించి కాన్వాసు మీద కుంచెతో మరోపోటు పొడిచి ఓ అడుగు వెనక్కు వేసి కళ్లు చికిలించి చూసి మళ్ళీ దాంతో తలబడ్డాడు. అతన్ని కది లించడం మంచిదికాదని నే వెళ్ళి ఆస్యా పక్కనే కూర్చున్నాను. ఆమె నల్లని కళ్లు నెమ్మదిగా నావంక తిరిగాయి.

ఆమె పెదవులమీద కొంచెం చిరునవ్వు తెప్పిద్దామని వ్యర్థప్రయత్నం ఎంతో చేసి చేసి—

"నిన్నటిలా లేవు నువ్వివ్వాళ" అన్నాను.

"అవును. లేను —" ఆమె కంఠస్వరంకూడ నీరసంగా వుంది-"రాత్రంతా నిద్రలేదు. ఏమిటేమిటో ఆలోచిస్తూ మేలు కునే వుండిపోయాను,"

"ఏమని ఆలోచన ?"

"ఒకటేమిటి - ఎన్నో ! నా కదో అలవాటు ! చిన్నప్ప ణ్ణుంచీ...మా అమ్మదగ్గర పెరిగేటప్పట్నుంచీకూడా..." ఆ

చివరిమాట అతికష్టంమీదగాని పలకలేకపోయింది. అలానే మళ్లీ అంది—

"మా అమ్మదగ్గర పెరిగేటప్పుడూ ంచీకూడా...అసలు ముందు జరగబోయేదేమిటో ఎవళ్లకీ ఎందుకు తెలీదా అనీ- ఒక్కోసారి ఏదో కొంప మునుగుతుందని తెలిసికూడా ఆ ఆపద ఎందు కడ్డుకోలేరు అనీ - ఉన్న దున్నట్టు సంపూర్ణ సత్యం ఎందుకు చెప్పరా అనీ ఆశ్చర్యపోతూండేదాన్ని...—నాకేం తెలీదు. నేను నేర్చుకోవాలి. మళ్లీ ఓనమాలు మొద లెట్టాలి! నేను సరైన పద్ధతిలో పెరగలేదు. పియానో వాయించలేను - బొమ్మలు గీయలేను - ఆఖరికి అల్లిక పనికూడా సరిగా చేతరాదు. నాకేవిధమైన ప్రజ్ఞా లేదు. నా సహవాసం ఎవళ్ళకేం పనికొస్తుంది?"

"నువ్వు మరీ అన్యాయం చేసుకుంటున్నావ్. నీకేం కావలసినంత చదివావ్-లోకం తిరిగి ప్రపంచజ్ఞానం సంపాదించావ్. బ్రహ్మాండమైన తెలివితేటలున్నాయి......"

"నిజంగా నాకు తెలివితేటలున్నాయంటారా?"

ఆమె అమాయక కుతూహలం చూసి నాకైతే నవ్వొచ్చింది. గాని ఆమె ముఖాన చిరునవ్వైనా పొడసూప లేదు.

"ఒక్కోసారి నా మెదడులో ఏముందో నాకే తెలీదు. నన్ను చూస్తే నాకే భయమేస్తుంది. నిజంగా నేనాడీ! నేను... నేను...అసలాడవాళ్లు అతిగా చదవ రాదంటారు నిజమేనా?"

"అంత అతిగా పనికిరాదనుకో...అయినా—"

"ఐతే నే చదవాల్సింది చెయ్యాల్సిందీ అంతా గిరిగీసి చెప్పండి నాకు. మీరు చెప్పినట్లు చేస్తాను" అంది ఆస్యా నిష్కపట విశ్వాసంతో నావైపు తిరిగి.

వెంటనే నేనేం జవాబివ్వలేకపోయాను.

"మిమ్మల్ని విసిగించేస్తున్నట్టున్నాను నేను."

"అబ్బెబ్బే-బలేదానివే మొత్తానికి..."

"హమ్మయ్య మీరు విసుగుపుడుతుందేమోనని తెగ భయపడ్డాను." అంటూ ఆస్యా తన వెచ్చని చిట్టిచేయి జాచి నా చేయి గట్టిగా పట్టుకు నొక్కింది. అంతలో గాగిన్ ఒక్క గావుకేక పెట్టాడు—

"ఏమండీ మహాశయా! బ్యాక్‌గ్రౌండ్ కాస్త గాఢంగా వుందనిపించడంలేదూ?"

నేను లేచి అతనిదగ్గరకు వెళ్ళాను. ఆస్యా హాల్లోంచి వెళ్ళిపోయింది.

## 12

ఓగంట తర్వాత ఆస్యా తిరిగివచ్చి గుమ్మంలో నిలబడి నన్ను రమ్మని చేత్తో సౌంజ్ఞ చేసింది.

"ఏమండీ-నే చచ్చిపోతే మీరు విచారిస్తారా?"

"ఛా ఛా-ఏమిటింత విచిత్రమైన ఆలోచనలు వస్తున్నాయి నీ బుఱ్ఱలో కివ్వాళ?"

"ఏమిటో! తొందరలోనే చచ్చిపోతానని పిస్తోంది. అందరూ నా దగ్గర శలవు తీసుకుంటున్నట్లనిపిస్తుంది నాకొక్కో

సారి. ఇలా బ్రతకడంకంటె చావు మేలుకదూ ... అలాచూడ కండీ నావంక. నేనేం నటించడంలేదు. నిజమే చెప్తున్నాను. అలా చూశారంటే మీరంటే నాకు మళ్ళీ హడలు పుడ్తుంది."

"నేనంటే నిజంగా నీకు భయమా?"

"నేనింత విపరీతంగా వుంటం నాతప్పా?... చూడండి- నవ్వుదామన్నా నవ్వు రావడంలేదు."

ఆ రోజంతా ఆస్యా అలానే చింతాక్రాంతంగా పరాకుగా వుంది. ఆమె మనసులోని సంచలన మేమిటో నాకర్థం కాలేదు. తరచు ఆమెచూపులు నామీద పడుతూండేవి. ఆమె చూసినప్పుడల్లా నాగుండె కాస్త కుంచించుకునేది. చూట్టానికి ప్రశాంతంగానే వున్నట్టు కనిపిస్తోందిగాని అనవసరంగా ఆందోళన పడవద్దని ఆమెతో చెప్పాలని నా కెన్నోసార్లు అనిపించింది. నేనే నిరుత్సాహంగా వున్నట్లు ఆమె గ్రహించింది.

నేనింకాస్సేపటికి వెళ్ళిపోతాననగా ఆమె అంది-"నేను ఆకతాయి పిల్లననీ అల్పురాలననీ మీ రెక్కడ అనుకునిపోతారోనని నాభయం...ఒక్క వాగ్దానం చెయ్యండి-నేనేంచెప్పినా నమ్ముతానని మాట యివ్వండి. మీకూ దాపరికం లేకుండా వుండాలి. నామటుకు నేనెప్పుడూ అబద్ధాలాడను. నిజంగా అబద్ధమాడను..." ఆ "నిజంగా అబద్ధ మాడను" అన్న మాటతో నాకు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వొచ్చింది. ఆస్యా ముఖం ఆత్రుతతో కుంచించుకుపోయింది-

"అదేవద్దు, నవ్వకండి. నవ్వితే మీరు నిన్న నన్నడిగిన ప్రశ్నే అడుగుతాను. 'ఎందుకలా నవ్వుతారు ?'... ఆస్యా ఒక్క క్షణం ఆగి మళ్ళీఅంది-

"నిన్న రెక్కల్నిగురించి ఏమన్నారో జ్ఞాపకముందా? నాకు రెక్కలొచ్చాయి. కాని ఎగిరిపోవడానికి చోటులేదు... ఎక్కడికని ఎగరను..."

"అదేమిటి- విశాలమైన యీ విశ్వమంతా నీదే!..." ఆస్యా నాకళ్ళల్లోకిసూటిగాచూసి కనుబొమలుముడివేసిఅంది-

"ఇవ్వాళ నేనంటే మీకు కోపంగావుంది కదూ!"

"నాకా? నీమీద కోపంగా వుందా?

ఇంతలో గాగిన్ మా దగ్గిరికొచ్చాడు-

"ఏమిటిద్దరూ అంత ముభావంగా వున్నారు? నిన్నటిలా మళ్ళీ వాల్జ వాయించేదా?"

"వొద్దు వొద్దు... ఇవ్వాళేం వొద్దు..." అంటూ ఆస్యా పిడికిళ్ళుబిగించి అంది.

"నిన్ను బలవంతం ఎవరుచేస్తున్నారే... ఎందుకలా ఇదౌతావ్?" ఆస్యా ముఖం మరీ వెల్లబారిపోయింది-

"ఇవ్వాళేంవద్దు" అంది మళ్ళీ తనలో తా ననుకుంటున్నట్టు.

* * *

జర్రున జారిపోతున్న రైన్‌నదిని సమీపిస్తూ నన్ను నేను ప్రశ్నించుకున్నాను-

"ఆమె నన్నేమైనా ప్రేమిస్తోందా?"

# 13

"ఆమెగాని నన్ను ప్రేమిస్తోందా!"

మర్నాడు నిద్ర లేవంగానే అదే ప్రశ్న వేసుకున్నాను. నా హృదయాన్ని తఱిచి చూసుకుందామనుకోలేదు కాని ఆకృతకహాసాల ప్రోవు ఆస్యా ప్రతిమ నాహృదయఫలకంమీద చిత్రీకరింపబడివుందని నాకు తెలుసు. అది వదిలించుకోలేక పోతున్నాను. ఆవేళ కూడ 'ల...'కు వెళ్ళి రోజంతా అక్కడే గడిపాను. ఆస్యా ఒక్క క్షణమాత్రమే కనిపించింది నాకు. ఆమె ఒంట్లో బాగా లేదు- తలనొప్పిట. నుదుటికి కట్టు కట్టుకుని మూసుకుపోతున్న కళ్ళతో ఒక్కసారి మాత్రం కిందికివచ్చి శుష్కహాసం చేస్తూ అంది-

"ఏం పరవాలేదు, అదే పోతుంది. అన్నీ పోతాయి కదూ?"

నామనసంతా కుంగిపోయి నన్నుకూడా ఏదో ఖిన్నత ఆవహించింది- ఏమిటో చెప్పరాని నైరాశ్యం- నిర్లిప్తత. ఐనా వెంటనే వెళ్ళిపోలేకపోయాను. చివరికి బయలుదేరి వెళ్ళేటప్పటికి చాలా పొద్దుపోయింది. మళ్ళీ ఆస్యా కనిపించనే లేదాపూట.

మర్నాడు ఉదయంకూడా మైమరపుగానే గడిచి పోయింది. ఏదోపని చేద్దామని ప్రారంభించడం- ఏం చేయలేక పోవడం, ఏం చెయ్యకుండా ఏ ఆలోచనలూ రాకుండా కొంతసేపు ప్రయత్నించి చూశాను.. ప్చ్-ఏదీ లాభంలేకపో యింది. పూరంతా బలాదూరు తిరిగాను. ఇంటికి వచ్చాను. మళ్ళీ బైటికి వెళ్ళాను.

"మీరేనాండీ 'న...'గారంటే ?" అని అకస్మాత్తుగా ఓ పసికంఠస్వరం పలకరించింది. వెనక్కి తిరిగి చూశాను. నా యెదురుగ్గా ఒకచిన్న పిల్లవాడు నిలబడి వున్నాడు-

"ఫ్రాలీన్ ఏనెట్టీ మీకిచ్చి రమ్మన్నారు" అంటూ ఓ చీటీ అందించాడు నాకు.

చీటీ తెరవంగానే ఆస్యా దస్తూరీ గుర్తుపట్టాను:

"నేను మిమ్మల్ని కలుసుకోవాలి జరూరుగా నాలుగ్గంటల కల్లా ఆ శిథిలదుర్గందగ్గర వుండండి. ఇవ్వాళ నేనో సాహసం చేశాను...దయచేసి తప్పకుండా రండి. అంతా మీకే తెలు స్తుంది. ఈ చీటీ తెచ్చిన కుర్రాడితో సరేనని చెప్పండి."

"జవాబేమైనా యిస్తారా?" అనడిగాడు కుర్రాడు.

"సరేనని చెప్పు"

వెంటనే నా గదికి తిరిగి వెళ్ళిపోయాను. అణిచిపెట్టు కున్న ఆలోచనలన్నీ ఒక్కసారి ఎగిసి చుట్టుముట్టాయి. నా గుండెలు పగిలిపోయేట్లు కొట్టుకోసాగాయి. ఆస్యా చీటీ మళ్లీ మళ్ళీ చదివాను. గడియారంవంక చూశాను. ఇంకా పన్నెండు కాలేదు.

ఇంతలో తలుపు తెరుచుకుని గాగిన్ లోపలకు వచ్చాడు. వచ్చీరావడంతోటే నాచేయి పట్టుకుని కుదిలించి వదిలిపెట్టాడు. చాలా ఆందోళన పడుతున్నట్టున్నాడు మనిషి. మొహంకూడా విచారాక్రాంతంగా వుంది.

"ఏమిటి సంగతి?" అనడిగాను. ఓకుర్చీ తెచ్చి వేసుకుని నా యెదురుగ్గా కూర్చున్నాడు. బలవంతంగా చిరునవ్వు తెచ్చుకుని మధ్యమధ్య మాటలు మింగుతూ అన్నాడు-

"నాలుగురోజులక్రితం మీకోకథ చెప్పి ఆశ్చర్య పరచాను. ఈపూట చెప్పేది విని మరీ ఆశ్చర్యపోతారు మీరు. నేను...నేంత...ఇంకెవరైనా ఐతే నేనింత ధైర్యం చేయగలిగేవాణ్ణికాను. మీరు మర్యాదస్తులు...నా మిత్రులు-హితైషులు-కదూ? ఇహ వినండి. ఆస్యా-నా చెల్లెలు-మిమ్మల్ని ప్రేమిస్తోంది."

నేను ఉలిక్కిపడి తల్లకిందులైనంతపనై కుర్చీలోంచి లేచాను...

"ఏమంటున్నారు? మీ చెల్లెలు..." నన్ను మధ్యలో ఆపాడు గాగిన్-

"అవును. దానికి పిచ్చెక్కింది. నాకు తెలుసు. నాకూ పిచ్చెక్కిస్తుంది. కాని అదృష్టవశాత్తూ దానికబద్ధాలాడటం చేతకాదు. నామీద పరమవిశ్వాసం వుంది దానికి. దాని హృదయం బంగారం. కాని దానిగొయ్యి అది తవ్వుకుంటోంది- నాకు తెలుసు- అది..."

"మీరు పొరబడివుంటారు" అన్నాను నేను.

"నేనేం పొరబడలేను. నిన్నటి సంగతి మీకు తెలుసుగా. రోజంతా పడుకునేవుంది. తిండీకూడా తినలేదు. ఏం మాట్లాడదు. అసలెప్పుడూ ఏంమాట్లాడదు లెండి. నిన్న సాయంత్రానికి కాస్త జ్వరం తగిలినా నేనేం పట్టించుకోలేదు. తెల్లవారుఝామున రెండుగంటలకి మాయింటియజమానురాలు నన్ను నిద్రలేపి 'మీచెల్లెల్ని వచ్చిచూడండి. ఆమె పరిస్థితేం బాగులేదు' అంది. నేను గబగబా వెళ్ళాను. బట్టలైనా మార్చుకోకుండా అలానే పడుకునివుంది. చెక్కిళ్ళమీద కన్నీళ్ళు చారికలు కట్టున్నాయి. నుదురంతా పేలిపోతోంది. బిగపట్టిన పళ్ళు గిజగిజలాడిపోతున్నాయి. 'ఏమిటమ్మా ఇది? ఒంట్లో బాగాలేదా?' అని అడిగాను. రెండుచేతులూ నాకంఠానికి పెనవేసి తనచావు చూడవలచుకోకపోతే వెంటనే తన్నక్కణ్ణుంచి ఎక్కడికైనా తీసుకుపొమ్మని యేడ్చింది... నాకేం అర్థంకాలేదు. దాన్ని శాంతపరుద్దామని ప్రయత్నించాను... ప్రయత్నించినకొద్దీ దానిదుఃఖం పట్టశక్యం కాకపోయింది... ఏడుస్తూ ఏమిటేమిటో చెప్పింది మిమ్మల్ని ప్రేమిస్తున్నట్లు అర్థమైంది నాకు. దాని ఉద్రేకాలలోతులు అవి దానిలో తెచ్చిపెట్టే వికారాలూ మీలాంటి నాలాంటి హేతువాదులకు తెలీవుబాబూ. ప్రళయంలా విరుచుకుపడి దాన్ని తల్లకిందులు చేస్తాయి...మీరు చూడచక్కనివారే...అయినా అది ఇలా ప్రేమలోపడటం నాకూ అనూహ్యంగానే వుంది. మొట్టమొదటి సందర్శనంలోనే మీరు దాన్ని ఆకర్షించారట. అందుకే మొన్నోరోజున నన్నుతప్ప ఇంకెవర్నీ ప్రేమించనంటూ వెక్కి

వెక్కి యేడ్చింది. మీరు వారిరహస్యం పసిగట్టారనీ దాన్ని ద్వేషిస్తున్నారనీ దాని అభిప్రాయం. తనకథ మీతో చెప్పానేమో నని అడిగింది. లేదన్నాననుకోండి. కాని అది దేవాంతకురాలు. ఇట్టే పసిగట్టేస్తుంది ఏసంగతైనా. అదిప్పుడు కోరేదల్లా ఒక్కటే. ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి- తక్షణమే వెళ్ళిపోవాలి. తెల్లవారేదాకా దానిపక్కనే కూర్చున్నాను. పొద్దునే వెళ్ళిపోదామని నాచేత ఒట్టువేయించుకునిగాని కళ్ళు మూయ్యలేదు నేను. ఆలోచించి ఆలోచించి చివరకు మీతో మాట్లాడదామని నిర్ణయించుకున్నాను. నేనుకూడా ఆ న్యాయ ఆలోచనే సరైందనుకుంటున్నాను. ఇద్దరం వెంటనే ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవడమే ఉత్తమం. అసలు ఓ ఆలోచన తట్టకపోతే ఈపూట దాన్ని తీసుకుని వెళ్లిపోయేవాణ్ణి కూడాను ..బహుశా...ఏమో మరి...మీకు నా చెల్లెలంటే అంగీకారమేనేమో? అలాఐతే ఎందుకు వెళ్ళిపోవాలి? అందుకని అభిమానం వదిలేసి, .అదీగాక నేనూ ఓ సంగతి గమనించాను...సరే మిమ్మల్ని అడిగేద్దామని...”తొట్రుపాటుతో ఆగిపోయాడు గాగిన్-“క్షమించండి-ఇలాంటి పరిస్థితిలో ఎప్పుడూ పడలేదు నేను.”

సమాశ్వాస పూర్వకంగా అతని చెయ్యి నా చేతిలోకి తీసుకుని కొంచెం దిటవుగా అన్నాను-

“మీ చెల్లెలంటే నా కిష్టమేనా అనికదూ మీప్రశ్న? ఆమెఅంటే నాకెంత అభిమానం వుందో మీకు తెలుసు-”

గాగిన్ నావైపు ఓరగాచూసి వెంటనే అటు తిరిగి తొట్రుబడుతూ అన్నాడు-

"కాని...దాన్ని పెళ్లి చేసుకోలేనంటారు..."

"అలాంటి ప్రశ్నకు నేనేం జవాబివ్వగలను? మీరే ఆలోచించండి-నేనీపళాన..."

గాగిన్ మధ్యలో అడ్డగించాడు.

"నాకు తెలుసు- నాకు తెలుసు. మిమ్మల్ని జవాబిమ్మని అడిగే అధికారంకూడా నాకులేదు. అసలు నాప్రశ్నే చాలా అసంభావ్యమైంది...కాని నేనేంచెయ్యను చెప్పండి? ఆస్యాతో చెలగాటలాడటం పనికిరాదు. దాన్ని మీరెరగరు. అది రోగం తెచ్చిపెట్టుకోగలదు- పారిపోగలదు- మీతో ఏదో సంకేతస్థలం ఏర్పాటు చేసుకోగలదు. దాని తెగువ అలాంటిది!... అదే ఇంకోపిల్ల అయితే అంతా కడుపులో దాచుకుని నిరీక్షించగలదు గాని ఆస్యావల్లమటుకు ఆపనికాదు. అందులోనూ దానికిలాంటి భావంకలగటం ఇదే మొదలు- దాంతో మరీ చిక్కైపోయింది. అది నాకాళ్ళమీదపడి ఏడ్చిన ధోరణి చూసివుంటే నాభయం మీకూ అర్థం అవును."

నేను ఆలోచనలో పడ్డాను. ఆమె నాతో సంకేతస్థలం ఏర్పాటు చేసుకోగలదన్న మాటలు నా గుండెల్లో శూలాల్లా పొడుచుకున్నాయి. అతనంత నిష్కల్మషంగా వున్నప్పుడు నేను విషయం దాచిపెట్టడం చాలా నీచమనిపించింది. చివరికి బైటపెట్టాను-

"మీరు ఆస్యాని బాగా అర్థంచేసుకున్నారు. ఆమె మీరెన్నంతపనీ చేసింది. ఓగంటక్రితం మీ చెల్లెలు చీటీ ఒకటి పంపింది. ఇదుగో చూడండి."

గాగిన్ గభాల్న చీటీ లాక్కుని గబగబా చదివి కుంగి పోయాడు. అతని ముఖంలో ద్యోతకమైన ఆశ్చర్యం చాలా హాస్యాస్పదంగా వుందిగాని నేను నవ్వేస్థితిలో లేను.

"మీరు మర్యాదస్తులని ఇందాక అన్నాను. అదేమాట మళ్ళీ అంటున్నాను. ఇప్పుడేమిటి కర్తవ్యం? అటు వెళ్ళిపోదా మనీ...ఇటు తన సాహసానికి తన్నే దూషుకుంటూ మీకీ వుత్తరమూ...ఎప్పుడు రాసిందబ్బా అసలీ వుత్తరం? ఏమిటి దాని వుద్దేశం? ఎందుకు రమ్మన్నట్టు మిమ్మల్ని?"

అతికష్టంమీద అతన్ని కాస్త ప్రశాంత పరచి జరగవల సినదాన్ని గురించి సాధ్యమైనంత సావధానంగా చర్చించాం.

చివరికీ నిర్ణయానికి వచ్చాం: పెద్దప్రమాదం ఏం జర క్కుండా వుంటంకోసం నేను ఆస్యా రమ్మన్నచోటికి వెళ్ళి ఆమెతో సంగతులన్నీ ఖచ్చితంగా మాట్లాడటం-గాగిన్ ఆ వుత్తరం గూడవేం ఎరగనట్లు ఇంటిదగ్గరే వుండటం-సాయంత్రా నికి మళ్ళీ మేమిద్దరం కలుసుకోవడం.

గాగిన్ నా చేతులు పట్టుకు అన్నాడు—

"మిమ్మల్ని ప్రాధేయ పడుతున్నాను-దాని మనసు గాయపరచకండి. మమ్మల్ని కాస్త కనికారంతో చూడండి. రేపెలాగూ ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతాం-మీరు ఆస్యాని పెళ్ళి చేసుకునేది లేదుగనక! అంతేకదూ?"

"సాయంత్రందాకా నాకు గడువియ్యి."

"సరే కానీండి...కాని మీరుమటుకు దాన్ని పెళ్లిచేసు కోరు."

అతను వెళ్లిపోయాడు. నేను సోఫామీదపడి కళ్ళు మూసుకున్నాను. నాతల తిరిగిపోతోంది. కొత్తకొత్త భావాలు లక్షలాదిగా ఉత్పత్తిల్లి నా బుఱ్ఱని గిఱ్ఱునతిప్పి పారేయసా గాయి. అంత నిష్కపటంగా వున్నందుకు గాగిన్‌మీద విసు క్కున్నాను. నన్ను ప్రేమించినందుకు ఓవంక సంతృప్తి పడు తూనే వున్నా అలాంటి ఇరకాటంలో పెట్టినందుకు ఆస్యా మీద విసుక్కున్నాను. తనఅన్నతో ఆ గొడవంతా ఎందుకు చెప్పిందో నాకర్ధంకాలేదు. క్షణాలమీద ఏదోవొక నిర్ణయా నికి రావాల్సిన అవసరం నన్ను మెలిపెట్టి చంపేస్తోంది...

సోఫాలోంచి లేచాను-

"అంతంత ఉద్రేకాలపుట్ట- పదహేడేళ్ళ పిల్లను- పెళ్ళి చేసుకోవడమా నేను?...ఎలా? ఎలాసంభవం ఇది?"

# 15

అనుకున్న టైముకి రైన్‌నదిదాటి అవతలబడ్డును జేరం గానే మళ్ళీ ఉదయం చీటీ తీసుకొచ్చినకుఱ్ఱాడుఎదురయ్యాడు. నాకోసమే చూస్తున్నట్టున్నాడు.

"ఫ్రావీన్‌ఏనెట్టే ఇమ్మన్నారు" అంటూ మరోచీటీ ఇచ్చాడు. ఆస్యా సంకేతస్థలం మార్చింది మరో గంటన్నరలో

ఫ్రాలూయీ ఇంటికి వెళ్ళి వీధితలుపు తట్టి మూడో అంతస్తు మీదికి వెళ్ళాలట నేను.

"మళ్ళీ సరేనని చెప్పమంటారా?" అనడిగాడు కుట్రాడు.

"సరే" నన్నాను.

ఇంటికి వెళ్ళి మళ్ళీ రావడానికి టైంలేదు- వీధుల్లో తిరగడం నాకిష్టంలేదు. అందుకని ఏటిబడ్డునే పడి నడవసాగాను. ఊరిగోడలకి ఇవతల చిన్న పార్కులాంటిది ఒకటుంది. బీరు తాగేవాళ్ళకి బల్లలు అవీ వేసివుంటాయి. అక్కడికి వెళ్ళాను. కొందరు జర్మన్ మధ్యవయస్కులు *'స్కిటిల్స్' ఆడుతున్నారు. చెక్కబంతులు చప్పుడు చేసుకుంటూ పరవళ్ళు తొక్కుతున్నాయి. మధ్యమధ్య మెచ్చుకోలు కేకలు, చప్పట్లు... ఒక చక్కనిచుక్క (వెయిట్రెస్) బీరు తీసుకొచ్చి నా ముందు పెట్టింది. ఏడ్చివడ్చి ఆమె కళ్ళు ఎఱ్ఱబడివున్నాయి. నేనామె ముఖంలోకి చూశాను. వెంటనే మొహం తిప్పేసుకుని పక్కకిపోయింది

నాపక్కనే కూర్చున్న ఒక పౌరుడన్నాడు-

"ప్చ్-పాపం. హాన్‌చెన్ మనసేం బాగులేదు. దాని ప్రియుడు ఇవ్వాళే సైన్యంలో జేరాడు."

మళ్లీ నేనామెవంక చూశాను ఓమూల పిడికిలిమీద గడ్డం ఆనించి నుంచుంది. చేతివేళ్ళమీదనుంచి ఒక్కొక్క

* కొయ్యసూదులు (సాధారణంగా నాలుగేసి) నిలువుగా చతురస్రంగా నిలబెట్టి పెద్దబంతితో పడగొట్టే ఒకరకం ఆట.

కన్నీటిబొట్లు జారి కిందపడుతోంది. ఎవళ్లో బీరు కావాలని కేక పెట్టారు. ఆమె వెళ్ళి బీరుయిచ్చి మళ్ళీ వెంటనే తన యథా స్థానానికి వెళ్ళి నిలబడింది. ఆమె దుఃఖం నన్నుకూడా కుంగ దీసింది...

జరగబోయే సమావేశం గురించి ఆలోచించసాగాను. కాని నా ఆలోచనలన్నీ ఏదో ఆసుర్దాతో భయంతో కూడి వున్నాయి. గుండెలమీద కొండపెట్టుకుని, ఈ సమావేశం కోసం వేచివున్నాను. ఇప్పుడు నేవెళ్ళేది పరస్పర ప్రేమాను భవం ఆనందించడానికి కాదు- నామాట నిలబెట్టుకోడానికి- అతికష్టమైన ధర్మంఒకటి నిర్వర్తించడానికి! 'ఆస్యాతో చెల గాటలాడటం పనికిరాదు!' గాగిన్ అన్నమాటలు నాహృద యంలో సూలాల్లా గుచ్చుకుపోయి వున్నాయి...హుఁ! నాలుగురోజులన్నా కాలేదు- ఏటివాలునపడి బల్లకట్టులో కొట్టుకుపోతూ ఈ సౌఖ్యంకోసంకదూ నేను పరితపించి పోయింది? ఇప్పుడదే సుఖం నా కందుబాటులోవుంది- నన్ను వెతుక్కుంటూ వచ్చింది- అది సంభవమై కూర్చుంది-ఐనా నేను దాన్ని అవతలకు నెట్టున్నాను...నెట్టితీరాల్సి వచ్చింది... ఈ ఆకస్మిక విపర్యాసం నన్ను కలత పరచింది. నాకేం తోచ నీయకుండా చేసింది. దానికితోడు ఆ విచిత్రజీవి ఆస్యా తన ముంగోపంతో, తన గత చరిత్రతో, తాను పెరిగిన తీరుతో (నిజంచెప్పొద్దూ) నన్ను హడలగొట్టేస్తోంది. ఏవేవో విరుద్ధ భావాలు నాలో చాలాసేపు సంకలసమరం చేశాయి. అను కున్నగంట దగ్గిర పడుతోంది...చివరకు నిర్ణయించుకున్నాను-

"నేనామెను పెళ్ళి చేసుకోలేను. నేనూ తన్ను ప్రేమిస్తున్నట్లామెకు తెలియనీయరాదు."

నేను లేచి ఒక థేలరు (జర్మన్ డాలరు) హాన్ చెన్ చేతిలో పెట్టి (ఆమె థేంక్స్ అనికూడా అనలేదు) ఫ్రాలూాయిూ యింటికి బయలుదేరాను. సాయంసమయపు నీడలప్పుడే సాగ సాగాయి. ఆ యిరుకు గొందిలో పైన కనిపించే నీలాకాశపు పీలిక సూర్యాస్తమయ కాంతులు ప్రతిఫలించి అరుణదీప్తితో వెలిగిపోతోంది. ఫ్రాలూాయిూ ఇంటిగుమ్మం దగ్గిరికి వెళ్ళి నెమ్మదిగా తలుపు తట్టాను. తలుపు వెంటనే తెరుచుకుంది. గుమ్మం దాటి లోపలికి అడుగు పెట్టాను-అంతా అంధకారమయంగా వుంది.

"ఇలారండీ- మీకోసమే చూస్తున్నాం" అంది ఓ ముసలి కంఠస్వరం ఆ చీకట్లోంచి.

"ఫ్రాలూాయిూ!" అని అడిగాను.

"అవును బాబూ నేనే."

అంటూ ఫ్రాలూాయిూ తన శల్యావశిష్టమైన చేతితో నాచేయి పట్టుకుని ఇరుకునిట్టుంగావున్న మెట్లుఎక్కించి తీసుకుపోయింది. మూడో అంతస్థుమీద వరండాలో ఆగాం. ఓకిటికీ సందులోంచి ప్రసరిస్తున్న అస్పష్టకాంతిలో ఆ ముసలి మొహం కాస్త చూడగలిగాను. వడిలిపోయిన పెదవులు మందహాసాని కనువుగా సాగదీసి, తన మసకకళ్ళు గుండ్రంగా తిప్పుతూ ఓగదిగుమ్మంవైపు చూపింది.

ఆ గదితలుపు తెరుస్తుంటే నా చెయ్యి కంపించింది. లోపలికి అడుగుపెట్టి ధడాల్న తలుపు వేసేశాను.

# 16

ఆ గదికూడా అర్ధాంధకారంలో వుంది. ఆస్యా వెంటనే నా కళ్ళకు కనిపించలేదు. ఓ కిటికీదగ్గర కుర్చీలో మొహం అటు పక్కకు తిప్పుకుని కూర్చుంది. భయపడ్డ పిట్టలా కప్పుకున్న శాలువలో ఒదిగిఒదిగి కూర్చుంది. అతి వేగంగా ఊపిరిపీల్చి వదుల్తోంది. మనిషి గజగజా కంపించిపోతోంది. ఆ క్షణంలో ఆమెపై నాకు వర్ణనాతీతమైన జాలి వెల్లువలా ఉప్పొంగి వచ్చింది. నేనామెను సమీపించాను. ఆమె మొహం మరింత పక్కకు తిప్పుకుంది...

"అన్నా నికోలేవ్నా!" అని పలకరించాను.

ఆమె కొంచెం నిటారుగా కూర్చుని నావంక చూడటానికి ప్రయత్నించింది కాని లాభం లేకపోయింది. ఆమెచెయ్యి నా చేతిలోకి తీసుకున్నాను- చల్లగా నిర్జీవంగా బరువుగా వుండిపోయింది నాచేతిలో.

"నేను..."

ఆమె మందహాసం చెయ్యడానికి ప్రయత్నించింది గాని పెదవులు స్వాధీనంకాలేదు.

"నా వుద్దేశం...ఊహుఁ— నావల్లకాదు. నే చెప్ప లేను!" అనిమాత్రం అనేసి వూరుకుంది. మాటమాటకీ ఆమె స్వరం ఎదురుతిరిగింది.

నేనామెపక్క నే కూర్చున్నాను.

"అన్నానికొలేన్నా-" నేనూ ఇంకేం మాట్లాడలేక ఆగిపోయాను.

ఎవళ్ళం ఏమీ మాట్లాడలేదు. నేనామెచేయి పట్టుకుని ఆమెవంకే చూస్తూ కూర్చుండిపోయాను. ఆమెకూడా ఆ శాలువలో అణిగిమణిగి అతికష్టంమీద ఊపిరితీస్తూ దుఃఖం కట్టలు తెంచుకురాకుండా మాటిమాటికి పెదవులు కొరుక్కుంటూ కన్నీళ్లు వెనక్కు నెట్టేసుకుంటూ కూర్చుంది. ఆమె భీతావిష్ట నిస్తబ్ధత నిస్సహాయ నీరవస్థితి చూస్తుంటే నాకు కడుపు తరుక్కుపోయింది. నీరసంతో నడవలేక నడవలేక దోవలో ఓకుర్చీ దొరికితే అందులో కూలబడ్డట్టుంది. నా హృదయం కరిగిపోయింది.

"ఆస్యా!" అన్నాను. ఆమెకు వినిపించిందో లేదో...

ఆమె నెమ్మదిగా కన్నులెత్తినా వంక చూసింది...స్త్రీ ప్రేమ ప్రపూర్ణ వీక్షణం...! దాన్ని వర్ణించడం ఎవరితరం? ఆమె చూపులు నన్ను వేడుకొన్నాయి. నన్ను నమ్మాయి-ప్రశ్నించాయి-తలవంచాయి...ఆ చూపుల్లోని సమ్మోహనశక్తి భరించలేకపోయాను. ఏవో సన్నని మంటలు నా నరనరాల్లో సూదులు గుచ్చుకున్నట్టు ప్రజ్వలించసాగాయి. నేనువంగి నా పెదవులతో ఆమె హస్తాన్ని చుంబించాను. ఏదో సంచలన

శబ్దం-ప్రకంపమానమైన నిట్టూర్పులా నా చెవుల్లోపడింది. ఆకులా అల్లల్లాడిపోతున్న చెయ్యి నాతలమీద అతి మృదులంగా నిమిరింది. నేను తలయెత్తి ఆమె ముఖంలోకి చూశాను. ఒక్క క్షణంలో ఆమె ముఖంలో ఎంతమార్పు! ఇందాకటి భయభావం అదృశ్యమై పోయింది. ఆమె చూపులు వెనుదిరిగి తనతోబాటు నన్నుకూడా అంతర్ముఖంగా లాక్కుపోయి నట్టున్నాయి. పెదవులు కొద్దిగా విడినడి, ముంగురులు గాలికి కొట్టుకుపోయినట్టు వెనక్కిపోయివున్నాయి. సర్వం విస్మరించాను. ఆమెను నాదగ్గరకు లాక్కున్నాను. ప్రతిఘటించకుండా ఆమెచేయి లొంగిపోయింది. చేతితోబాటుఆమెసర్వదేహమూ నాదగ్గరకు జరిగింది. శాలువా మూపులమీదనుంచి జారిపోయింది. ఆమె శిరసు నావక్షంమీద ప్రశాంతంగా విశ్రమించింది-పైన నా పెదవులు మండిపోతున్నాయి...ఎక్కడో కొండ గుహలోంచి మాట్లాడినట్టు అస్పష్టంగా "నీదాన్ని" అంది ఆస్యా. నాచేయి ఆమె నడుంమీదకు జారింది...కాని హఠాత్తుగా గాగిన్ నాస్మృతిపథంలో మెరుపులా మెరిశాడు. ఉలిక్కిపడి ఒక్క కేకపెట్టి వెనక్కు జరిగాను-

"ఏమిటిది? ఏంచేస్తున్నాం మనం?...మీ అన్నయ్య... అతనికంతా తెలుసు. మనిద్దరం కలుసుకుంటున్నట్టుకూడా తెలుసతనికి!..."

ఆస్యా కుర్చీలో వెనక్కి వాలిపోయింది.

నేను లేచి దూరంగా ఓమూలకు వెళ్ళాను-

"అవును. మీ అన్నయ్యకంతా తెలుసు... నేనతనికి చెప్పి తీరాల్సివచ్చింది..."

"చెప్పితీరాల్సి వచ్చిందా!" అని వినిపించీ వినిపించ కుండా అంది ఆస్యా. ఆమెకి ఇంకా ఒళ్ళు తెలీలేదు- నేననేది ఆమెకేం అర్థంకావడం లేదు.

"అవును-"

ఎందుకో చెప్పలేని తీవ్రతతో అన్నాను-

"అసలు తప్పంతా నీది! నువ్వెందుకు బయటపడాలి ముందు? మీ అన్నయ్యతో ఈ సంగతంతా నిన్నెవరు చెప్ప మన్నారు? అతనంతట అతనే ఇందాక నాదగ్గరకొచ్చి నువ్వు అతనికి చెప్పిందంతా నాకు చెప్పాడు. అంతా నాశనం- అంతా నాశనమై పోయిందిప్పుడు!"

ఆస్యావంక చూడకుండా వుండటానికి గదిలో అటూ యిటూ పచార్లు తొక్క సాగాను.

ఆస్యా కుర్చీలోంచి లేవబోయింది.

"కూర్చో. నువ్వు లేవవద్దు. నేను మర్యాదస్తుణ్ని. అవును నాకు మానమర్యాదా వుంది. నువ్వేం భయపడక్క్లేదు- ఎందుకు- ఎందుకిలా తల్లకిందులైపోయావ్ నువ్వు? నాలో యేమైనామార్పు కనిపించిందా? ఇవ్వాళ మీఅన్న నాదగ్గిరికొచ్చినప్పుడు నిజం దాచలేకపోయానతని ముందు!"

ఏమిటి నే వాగుతున్నాను? ... నేనో పచ్చిమోస గాణ్ణి! మా సమావేశం సంగతి గాగిన్‌కు తెలుసు! అంతా

బహిరంగమైపోయింది! ఓ భయంకరవికార స్వరూపం దాల్చింది! నా బుద్ధి తిరిగిపోయింది.

"నేనేం పిలువలేదు మా అన్నయ్యని. అతనే వచ్చాడు నా గదిలోకి!" ఆస్యా గొంతు భీతితో ఇగుర్చుకుపోయింది.

"చూడు మరి ఏంపని చేశావో! ఇప్పుడేమో నువ్వీ వూరునుంచే వెళ్ళిపోదామనుకుంటున్నావ్..."

"అవును వెళ్ళిపోవాలి. అందుకే మిమ్మల్ని రమ్మన్నాను. మీ దగ్గర శలవు తీసుకువెళ్ళి పోదామని..."

"నిన్ను వదిలిపెట్టడం నా కంత తేలికనా నీఅభిప్రాయం?"

"ఐతే... అసలు...మీరు మా అన్నయ్యతో ఎందుకు చెప్పారు?"

"మరంతకంటే ఏం చెయ్యాను? నువ్వే కనక అతనితో చెప్పి వుండకపోతే..."

"అప్పటికే, నాగది లోపలపక్క తాళం వేసుకొనే దిగ్బంధనం చేసుకూర్చున్నాను. ఇంటి యజమానురాలు దగ్గర మరో తాళంచెవి వుందని నాకేం తెలుసు?"

ఆమె అలా అమాయకంగా ఒప్పుకోవడం చూసి నాకు మరి కోపం వచ్చింది...ఇప్పుడా ఘట్టం తలుచుకున్నప్పుడల్లా నా మనసు కరిగి నీరైపోతుంది...పాపం-కల్లాకపటం ఎరగని పసికందు!

"ఇక చేసేదేముంది? అంతా ఐపోయింది. ఇహామనం విడిపోవటం తప్ప చెయ్యగలిగిందేం లేదు"

అంటూ దొంగతనంగా ఓసారి ఆమెవంక చూశాను. ఉన్నట్టుండి ఆస్యా ముఖం ఎఱ్ఱబడిపోయింది. సిగ్గు సంభ్రమం ముంచెత్తుకొచ్చాయనుకుంటాను. నే మటుకు ఏదోసంధిలో పడ్డట్టు అటూ యిటూ తిరుగుతూ వాగుతూనే వున్నాను—

"నీలో అంకురించి పుష్పిస్తున్న భావాన్ని వికసించనీయ లేదు నువ్వు. మనయిద్దరిమధ్య బంధాలూ చేచేతులా తెగ్గొట్టేశావ్. నన్ను నమ్మలేకపోయావ్-నన్ననుమానించావ్..."

నే మాట్లాడుతున్నంతసేపూ ఆస్యా అంతకంతకూ ముందుకు వంగిపోయి మోకాళ్ళమీద పడి మొహం చేతుల్లో కప్పుకుని ఏడ్వసాగింది. నే నామెను సమీపించి లేవదీయ బోయాను గాని ఆమె నెట్టివేసింది. ఏడ్చే ఆడదాన్ని నే చూడ లేను. ఆదృశ్యం నే సహించలేను.

"అన్నా నీకొ లేవ్నా! ఆస్యా! నిన్ను ప్రార్థిస్తాను-ఏడవకు..."అంటూ మళ్ళీ ఆమెచేతులు పట్టుకున్నాను.

కాని హఠాత్తుగా ఆస్యా ఉవ్వెత్తునలేచి మెరుపులా గుమ్మందాకా పరుగెత్తుకెళ్ళి అదృశ్యురాలైపోయింది.

తర్వాత కొంతసేపటికి ప్రాలూయీ లోపలికి వచ్చేదాకా నేనక్కడే నిలబడిపోయాను. పిడుగు పడ్డట్టు చైతన్యరహితంగా స్థాణువులా నిలబడిపోయాను. మా సమావేశం అంతత్వరగా అంత అప్రయోజకంగా ముగియటం నా కర్థం కాలేదు. నే చెప్పదలచుకున్న దాంట్లో నే చెప్పాల్సిన దాంట్లో నూరోవంతైనా చెప్పలేదు...మా సమావేశం ఎలా ముగుస్తుందో ఊహించనైనా లేదింకా...

"ప్రవీణ్ ఏమైనట్టే వెళ్ళిపోయిందా?" అని అడిగింది ప్రాలూయీ.

నేనామెవంక శూన్యదృక్కులతో ఓసారిచూసి ఏం మాట్లాడకుండా వెళ్ళిపోయాను.

నేనాయింట్లోంచి బైటపడి వీధు లధిగమించి వూరు దాటి మైదానంవైపు నడిచాను. భయంకరమైన చీదర నన్ను నిలువెల్లా దహించివేస్తోంది...ఆస్యా మా సంకేత స్థలం ఎందుకు మార్చిందో, ఆ ముసలిదాని ఇంటికి పోవడాని కామె కెంత మనోదార్ఢ్యం కావలసివచ్చిందో నేనేం ఊహించుకోలేక పోయాను. ఆమె పరుగెత్తుకు పోతుంటే నేనెందు కడ్డగించలేదు? ఆ పాతకొంపలో, ఆ చీకటికొట్లో కసక ఆమెను బెదిరించి చివాట్లు పెట్టగలిగే ధైర్యం సాహసం నా కొచ్చాయిగాని ఇప్పు డామె స్వరూపం నన్ను వెంటాడుతోంది నేచేసిన అపరాధం దయ్యంలా నన్ను పీక్కు తినసాగింది. క్షమించమని కోరాను- ఎలుగెత్తి ప్రార్థించాను...ఆ వివర్ణమైన ముఖము, భయపడ్డ చంచలాక్షులు, మెడమీద వ్రేలాడుతున్న కుటిలాలకలు, నా వక్షస్థలంమీద వాలిన ఆమె శిరస్స్పర్శ, అన్నీ కళ్ళకు కట్టి నన్ను దహించివేస్తున్నాయి. "నీదాన్ని" అన్నఆమె అస్పష్ట కంఠస్వరం నా చెవుల్లో గింగుర్లెత్తిపోయింది...నేను మటుకేం చేశాను? నా మనస్సలా అనిపించింది-నేనేం చేసినా అది నా మనఃపూర్వకంగానే చేశాను - నా అంతరాత్మకు తలఒగ్గాను' అని సమాధాన పర్చుకున్నాను...కాని అది నిజం కాదు. ఇదేనా నే కోరిన పరిసమాప్తి? ఇదేనా నే సాధించగలచు

కొన్న సిద్ధి? నేనసలా మెను విడచివుండగలనా? ఆమెను పోగొట్టుకోనగలనా నేను?-

"పిచ్చి! పిచ్చి!" అనుకున్నాను హృదయంలో కార్చిచ్చు రేగుతూండగా.

పొద్దుగుంకపోతోంది. వెనుదిరిగి నెమ్మదిగా ఆస్యా ఇంటివైపు నడిచాను.

# 18

గాగిన్ ఇంట్లోంచి గబగబా బైటికొచ్చాడు-

"మా చెల్లిని కలుసుకున్నారా?"

"ఇంటిదగ్గర లేదా?" అనడిగాను.

"లేదే!"

"ఇంకా అసలు తిరిగి రానేలేదా?"

"లేదు. . .క్షమించండి- వుండబట్టలేక దుర్గం దగ్గిరికి నేనూ వెళ్ళాను ఇందాక. కాని అది అక్కడలేదు. ఐతే అసలు అది రానేలేదన్నమాట?"

"దుర్గం దగ్గిరికి రాలేదు."

"ఐతే మీరు కలుసుకోనేలేదు?"

కలుసుకున్నానని ఒప్పుకతీరాల్సివచ్చింది.

"ఎక్కడ?"

"ఫ్రావులూయిజ ఇంట్లో. నేనక్కణ్ణుంచి వచ్చేసి గంట పైనే అయింది. ఇంకా ఇక్కడకి వచ్చేసి వుంటుందనుకున్నాన్నేను."

"సరే- చూద్దాం కాస్సేపు" అన్నాడు గాగిన్.

ఇద్దరం లోపలికి వెళ్ళి కూర్చున్నాం. ఎవళ్ళం ఏం మాట్లాడలేదు. మా పరస్పరసామీప్యం ఇద్దరికీ ఇబ్బందిగానే వుంది. చీటికి మాటికి తలయెత్తి గుమ్మంవంక చూస్తూ చెవులు రిక్కించి కూర్చున్నాం. చివరికి గాగిన్ లేచాడు-

"ఛీ ఛీ! నాకేం పాలుపోవడం లేదు. అది నా ప్రాణాలకి దాపురించింది. నిజంగా నా ప్రాణాలు కొరికేస్తోంది. . .లేవండి- వెళ్ళి వెతికొద్దాం." ఇద్దరం బైటికివచ్చాం. ఇంకా బాగా చీకటిపడలేదు.

"ఏం మాట్లాడారిద్దరూ?" అనడిగాడు గాగిన్.

"ఐదునిముషాలకంటే ఎక్కువ వుండలేదు నేనామె దగ్గర. మనం అనుకున్నదే అక్కడా అన్నాను."

"ఓ పనిచేద్దాం. మనిద్దరం విడివిడిగా వెదుకుదాం. అలా అయితే తొందరగా కనిపించవచ్చునది. ఏమైనా- ఓగంట లోపు ఇంటికి వచ్చెయ్యండి మళ్ళీ."

# 19

గబగబా స్లోపు దిగి వూళ్ళోకి పరుగెత్తుకుపోయాను. నడానికిగా వీధులన్నీ తిరిగాను. వీలైనచోట్లన్నీ గాలించాను. ఫ్రాలూయిూ ఇంట్లోకూడా చూసి ఏటివొడ్డున చాలాదూరం వెతికాను... ఆస్యా ఎక్కడా కనిపించలేదు. ఇప్పుడు నన్ను దహిస్తున్నది కోపమూ చీదరా కాదు. ఏదో రహస్య భయం-

భయం ఒక్కటే కాదు-ఏదో వ్యాకులత...పశ్చాత్తాపం-ప్రేమ-అవును ప్రేమ! మృదులాతి మృదులమై అనిర్వచనీయమైన ప్రేమ! చేతులు నలుపుకున్నాను. గుండెలు బాదుకున్నాను. కమ్ముకొస్తున్న ఆ అంధకారంలో ముందు మెల్లగా తర్వాత బిగ్గరగా ఆస్యాను పేరుపెట్టి కేకలు వేశాను. ఆమెను ప్రేమిస్తున్నానని నూరుసార్లు ఎలుగెత్తి అరిచాను. మళ్ళీ ఎన్నటికీ వదిలిపెట్టనని ప్రమాణం చేసుకున్నాను. మళ్ళీ ఒక్కసారి ఆమె చల్లని చేయి స్పృశించడానికి, ఆమె మెల మెల్లని అస్పష్ట కంఠస్వరం వినడానికి, నా ముందు మరొక్కసారి ఆమెను సాక్షాత్తూ చూడటానికి నా సర్వస్వం కోల్పోవడానికి సిద్ధపడ్డాను. ఆమె నా కెంత దగ్గరగా వచ్చింది! ఎంత నిశ్చయం చేసుకుని తన అమాయకత్వం, ఉద్రేకం-అనాఘ్రాత యవ్వనం మూటకట్టుకు వచ్చింది నాకోసం! కాని-ఆమెను ఒక్కసారైనా నా గుండెలకు హత్తుకోలేను నేను...ఆనందంతో సుఖపారవశ్యంతో ప్రజ్వలించిపోయే ఆమె ముఖాన్ని కళ్ళారా చూసే మహాదానం దాన్ని చేతులారా అవతలికి నెట్టి పారేశాను...ఈ ఆలోచన నాకు మరీ పిచ్చెక్కించింది.

'ఎక్కడికెళ్ళింది ఆస్యా? ఏమైంది?' అని అసమర్థ ఉగ్రతతో గొంతెత్తి ప్రశ్నించుకున్నాను. దూరంగా ఏటిఒడ్డున ఏదో తెల్లగా నా దృష్టిపథంలో పడింది. ఆస్థలం నాకు తెలుసు. డెబ్భై యేళ్ళ క్రితం నదిలోపడి ఆత్మహత్య చేసుకున్న ఒక యువకుని సమాధి అది! నా గుండెలు కొట్టుకోవడం ఆగిపోయినంత పనైంది...గబగబా సమాధిదగ్గరకు పరుగెత్తుకెళ్ళాను—

'ఆస్యా! అని దిక్కులు పిక్కటిల్లేట్లు ఒక్క కేక పెట్టాను. నా కేకకు నేనే అదరిపోయాను... కాని ఎవరూ బదులు పలక లేదు...

ఇంటికి వెళ్ళిపోయి గాగిన్‌కు ఎక్కడైనా కనిపించిం దేమో తెలుసుకుందామనుకున్నాను.

## 20

తడబడుతున్న అడుగుల్తో ద్రాక్షతోటలోంచి పరుగెత్తు తూంటే ఆస్యా గదిలో దీపం కనిపించింది... దాంతో నా మనస్సు సహం తేలికపడింది.

గుమ్మం దగ్గిరికి వెళ్ళాను. తలుపు లోపల గడియవేసి వుంది. తలుపు తట్టాను. కింద అంతస్తులో వెలుతురు లేని ఓగది కిటికీ నెమ్మదిగా తెరుచుకుని గాగిన్ తల బైటికి కనిపించింది.

"కనిపించిందా ఆస్యా?" అని అడిగాను.

గాగిన్ బాగా గొంతు తగ్గించి రహస్యంలా చెప్పాడు-

"అదే తిరిగి వచ్చింది-తనగదిలో బట్టలు మార్చుకుం టోంది ఏం పరవాలేదు. అంతా బాగానే వుంది"

"హమ్మయ్య! ఆ భగవంతుడికి వెయ్యిదణ్ణాలు!" బ్రహ్మాండమైన భారం దిగిపోయి నా గుండెలు సంతోషంతో నిండిపోయాయి.

"ఇంకేం. అంతా దివ్యంగా సాగిపోతుందిహ. ఆఁ- అన్నట్టు-మనిద్దరం మళ్ళీ మాట్లాడుకోవల్సిన విషయం ఒక టుంది!"

"ఇప్పుడుకాదు—ఇప్పుడుకాదు. మరోసారి. సరే-ఇహ శలవు!" అంటూ కిటికీ తలుపు నెమ్మదిగా వేయ నారంభించాడు గాగిన్.

"రేపు కలుద్దాం అన్ని విషయాలూ రేపు తేల్చేద్దాం"

"గుడ్ బై!" అని గాగిన్ తలుపు వేశేశాడు. తలుపు తట్టుదామనుకున్నాను- నీచెల్లెల్ని పెళ్లి చేసుకుంటానని చెప్దామనివుంది కాని. . .పెళ్ళిమాటలకది తగిన అదను కాదని వూరుకున్నాను.

"రేపు. . .రేపటిదాకా ఆగితేచాలు. . .ఇహ నన్నెవరికీ పట్టశక్యంకాదు! నాఅంత సుఖజీవి మరోడుండడు!' అనుకున్నాను.

మర్నాడు నేను సుఖం జూరగొనవలసినవాణ్ణి. కాని సౌఖ్యం మర్నాడనేది ఎరగదు. గతదినం అసలు జ్ఞాపకమే వుండదు దానికి. దానికి తెలిసిందల్లా వర్తమానం- అదైనా క్షణికం!

నేను 'జ. . .'పట్నం ఎలా జేరుకున్నానో నాకే తెలీదు. నాకాళ్ళుకాదు నన్ను నడిపించింది- ఏరు దాటించింది బల్లకట్టు కాదు- పెద్దపెద్ద రెక్కలు మొలిచి అమాంతం అవతలకు ఎగరేసుకుపోయాయినన్ను. దోవలో ఓ లతా నికుంజం కనిపించింది. అందులో ఓకోయిల కమ్మగా పాడుతోంది. ఆపాట వింటూ అలానే చాలాసేపు నిలబడిపోయాను. అది నా ప్రేమనిగురించీ నా అదృష్టాన్ని గురించీ పాడుతున్నట్టుంది.

# 21

మర్నాడు ఉదయం మళ్లీ గాగిన్‌ల బంగళాకు బయలు దేరాను. కిటికీలూ ద్వారాలూ అన్నీ బోర్లగా తెరిచివుంటం చూసి ఆశ్చర్యపోయాను. సింహద్వారంముందు ఏవో కాగితం ముక్కలూ అవీ చెత్తగా పడివున్నాయి. దాసీపిల్ల ఒకతె చీపురుకట్ట తీసుకుని లోపల్నుంచి వచ్చింది.

నేనామెను సమీపించాను. . .ఇంకా నేనడక్కముందే వాళ్ళు వెళ్ళిపోయారని ఆమె మొరిగింది.

"వెళ్ళిపోయారా? ఏమిటి నువ్వనేది ? ఎక్కడికెళ్లారు?"

"ఇవ్వాళ ఉదయమే వెళ్లిపోయారు- ఆరుగంటలకి ఎక్కడికి వెళ్తున్నదీ ఏం చెప్పలేదు. మీ పేరు 'న. . .'గారే కదూ ?"

"అవును."

"ఇంటియజమానురాలికో చీటీరాసి యిచ్చి వెళ్లారు మీ కిమ్మని."

అని మేడమీదకు వెళ్ళి ఉత్తర మొకటి తెచ్చి యిచ్చింది.

"అసంభవం...ఇదంతా...మాయ..." నా నోటి మాట పెగల్లేదు. ఆమె నావంక నోసారి శూన్యంగా చూసి నేల ఊడవటం ప్రారంభించింది.

నేను ఉత్తరం విప్పి చూశాను. ఆస్యా అక్షరం ఒక్కటి కూడా లేదు-గాగిన్ రాశాడు.

ఇలా అకస్మాత్తుగా వెళ్ళిపోయినందుకు కోపం తెచ్చుకోవద్దనీ-కాస్త తీవ్రంగా ఆలోచిస్తే తాను చేసిన పని నేను కూడా మెచ్చుకుంటానని తన నమ్మకమనీ వ్రాశాడు. అనవసరంగా చిక్కులూ ప్రమాదాలూ ఎక్కువ కాకముందే ఈ పరిస్థితిలోంచి బయట పడటానికి కింకో మార్గం లేదట. 'రాత్రి మనిద్దరం ఆస్యాకోసం నిరీక్షిస్తూ మౌనంగా కూర్చున్నప్పుడు ఆలోచించాను మనకు విడబాటుతప్పదనే నిర్ణయానికివచ్చాను. కొన్ని కొన్ని ప్రతికులాభిప్రాయాల్ని కూడా నే గౌరవించి మన్నించగలను. మీరు ఆస్యాని వివాహం చేసుకోలేరని నేనర్థం చేసుకున్నాను. అదికూడా నాకు జరిగిందంతా చెప్పింది. నన్ను వేపుకుతింది.ఆమె కోరికను మన్నిస్తానని చెప్పి ప్రశాంతపరచాల్సి వచ్చింది.' మా స్నేహం అంత త్వరగా అంతమైనందుకు విచారిస్తూ, తనకు నామీద ఎప్పుడూ గౌరవభావం వుంటుందంటూ, ఎప్పుడూ ఎక్కడా వాళ్ళ ఆనుపానులు తెలుసుకోడానికిమటుకు ప్రయత్నించవద్దని వేడుకుంటూ ఉత్తరం ముగించాడు గాగిన్.

"ఏమిటా ప్రతికూలాభిప్రాయాలు? ఏమిటయ్యా ఈ నాన్సెన్స్? ఆస్యాను నాదగ్గిర్నుంచీ తీసుకుపోవడానికి నువ్వెవరవసలు?..."

రెండుచేతులా నాకణతలు పట్టుకునొక్కుకున్నాను. దాసీది భయపడి ఇంటావిడకోసం కేకపెట్టింది. దానిభయం చూసి నేను నిలదొక్కుకోవాల్సివచ్చింది. వాళ్లెక్కడికెళ్లారో తెలుసుకోవాలి- ఏమైనాసరే తెలుసుకుతీరాలి! ఇదొక్కటే ఆలోచన నఖశిఖపర్యంతం నన్ను దహించివేసింది. నేనీచావు దెబ్బతిని వూరికే పడివుండలేను. ఏర్పడిన సమస్యకి ఇదికాదు నేకోరిన సమాధానం! యజమానురాలిని బుజ్జగించి, బ్రతిమిలాడి కొంత సంగతి తెలుసుకున్నాను. ఉదయం ఆరుగంటలకు ఒక స్టీమరెక్కి ఏటివాలున జయద్దేరారట. వెంటనే టిక్కెట్ల ఆఫీసుకు వెళ్ళాను. అక్కడవాళ్ళు కొలోన్‌కు టిక్కెట్లు తీసుకున్నట్టు తెలిసింది. నాసామాన్లుకూడా సర్దుకుని తర్వాత స్టీమరెక్కుదామని గబగబా నాబసకు దారితీశాను, దారిలో ఫ్రౌలూయిూ ఇల్లువుంది. అందాకా వచ్చేసరికి నన్ను ఎవరో పేరుపెట్టి పిలిచారు. తలయెత్తి చూశాను. నేను నిన్న ఆస్యాను కలుసుకున్న గదికిటికీలోంచి ఆ వృద్ధవితంతువు తొంగి చూస్తోంది. వికారమైన చిరునవ్వునవ్వి మళ్ళీ పిలిచిందినన్ను. నేను అసహ్యంతో వెళ్ళిపోబోయాను గాని ఆమె మళ్ళీ కేకపెట్టి చిన్నకబురుంది పైకిరమ్మంది. నేను లోపలికివెళ్లాను. మళ్ళీ ఆగదిలో అడుగుపెట్టగానే నాహృదయం లోనైన భావ సంచలనం నేవర్ణించలేను.

"మీాఅంతట మీారుకనక ఇక్కడికొస్తే ఈచీటీ ఇవ్వమన్నారు నీకు. ఐనా నువ్వు చాలా మంచిబాబువి కనక పిలిచే ఇస్తున్నాను తీసుకో."

చీటీ అందుకున్నాను. ఓ చిన్న కాగితం ముక్కమీద గబగబా పెన్సిలుతో నాలుగు ఒంతులు బరికేసి వున్నాయి!

"శలవు. మళ్ళీమనం ఎన్నటికీ కలుసుకోలేము. నేవెళ్ళి పోతున్నది గర్వంతో కాదు, అదిరిపాటుతో అసలే కాదు. అంతకుమించి గత్యంతరంలేదు. నిన్న మీ ఎదుట భోరున ఏడ్చాను. ఒక్కమాట-ఒక్కటంటే ఒక్కటే మాట మీరు కనక అనివుంటే వుండిపోయేదాన్ని. మీరు అనలేదు. అంతా మంచికే అయివుంటుంది. . .శలవు ! ఈజన్మకిక శలవు !"

ఒక్కమాట !. . .ఓహ్-ఎంత మూఢుడనై పోయాను ! ఒక్కమాట. . .ఆ క్రితంరోజు ఆ మాటను కన్నీళ్ళతో ధారా పాతంగా తడిపేశానే ! ఆమాట ధ్వనితో వాతావరణమంతా నింపేశానే ! ఆమాట ఎలుగెత్తి ఘోషించి దిక్కులకు వినిపించానే!. . .కాని ఆమెతో మాత్రం అనలేదు-ఆమెను ప్రేమిస్తున్నానని ఆమెకు మాటమాత్రం చెప్పలేదు. ఎలా చెప్పగలను? చెప్పరాని పరిస్థితే అది ! మృత్యుగహ్వరంలాంటి ఆ గదిలో అడుగుపెట్టేసరికింకా నాలోని ప్రేమని నేనే గుర్తించలేదు ! ఆమె సోదరునితో కలిసి ఏంచెయ్యడానికీ తోచక వూరికే నిరీక్షిస్తున్నప్పుడు కూడా ఆభావంపైకి రాలేదు. . .ఆమెకోసం వెతుకుతూ పేరుపెట్టి కేకలేస్తూ ఏదో దారుణం జరిగి వుంటుందని భయంవేసినప్పుడుగదా ఆ ప్రేమభావం ఉవ్వెత్తునపొంగి విలయసముద్ర వారాశివలె నన్ను కలచి పారవైచినది!. . .కాని అప్పటికే చాలా ఆలస్యమైపోయింది. 'ఆఁ ఆఁ అసంభవం !' అంటారు మీరు. సంభవమో కాదో నాకేం తెలీదు-జరిగింది

మాటుకది! ఆస్ట్యాలో ఏమాత్రం వగలాడితనం వున్నా ఆ కృత్రి మమైన అవస్థ ఏమాత్రం ఆపాదించుకోకుండా వున్నా ఆమె వెళ్లిపోయేదికాదు. కాని మిగతా అందరు ఆడపిల్లల్లా కాదామె. వాళ్ల సహనం ఈమెకులేదు. అదే అర్ధం చేసుకోలేకపోయాను. కిందటిరోజు సాయంత్రం కిటికీదగ్గర గాగిన్‌తో నేను చెప్పబోయి మానేసి మందబుద్ధినై ఆఖరు గడ్డిపరకకూడా చేజేతులా వది లేశాను.

ఆరోజే నేను సామానంతా సర్దుకుని కొలోన్ స్టీమ రెక్కాను. స్టీమరు బయలుదేరి పోతుంటే నేనెన్నటికీ మర్చి పోలేని ఆ వూళ్ళు, వీధులు స్థలాలు-అన్నిటి దగ్గర్నుంచీ మానసికంగా శలవు తీసుకున్నట్టనిపించింది. దూరంగా హాన్ చెన్ కనిపించింది. ఏటిఒడ్డున ఓ బెంచీమీద కూర్చునివుంది. పక్కనే మరో యువకుడు కూర్చుని ఏదో చెప్పి నవ్వుతున్నాడు. ఏటి అవతల ఒడ్డున నా ప్రియమైన అశోకవృక్షం-దట్టమైన దాని కొమ్మల సందుల్లోంచి 'మడోనా'బొమ్మ యథాప్రకారం అర్థం కాని చిరునవ్వు నవ్వుతూనే వుంది.

## 22

కొలోన్‌లో గాగిన్ల ఆరాతీశాను. అప్పటికే వాళ్ళు క్కణ్ణుంచి లండన్‌కు వెళ్లిపోయినట్లు తెలిసి నేనూ అక్కడికి వెళ్ళాను. కాని లండన్‌లో నాప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యాయి. వాళ్ళను కనుక్కోవడానికి నేపడ్డ శ్రమఅంతా వృథా అయిపోయింది. ఈ అపజయాన్ని అంగీకరించలేక ఇంకా

అన్వేషణ సాగించానుగాని కొన్నాళ్ళకి ఆ ప్రయత్నం విరమించక తప్పిందికాదు. ఆస్యా జీవించివుందో మరణించిందో కూడా తెలీలేదు నాకు. కొద్ది సంవత్సరాలక్రితం ఒక విదేశంలో రైల్లో ఓమనిషి కనిపించింది. ముమ్మూర్తులా ఆస్యాపోలికలే ఆ ముఖంలో. ఎంత మరిచిపోదామనుకున్నా మరుపురాని పోలికలు!...కాని...ప్చ్...అవ్వి వట్టిపోలికలు మాత్రమే. నేను భ్రమపడ్డాను...ఆస్యా- నాయావజ్జీవితంలోనూ ఏకైకమైన సుఖపరమావధి క్షణంలో చూసిన ఆస్యా- ఆ కుర్చీలో కుంగిపోయికూర్చున్న ఆస్యా- నాస్మృతిలో సశ్వరంగా నిలిచిపోయింది.

కాని- ఒకటిమాత్రం ఒప్పుకోవాలి నేను. ఆమెను గురించి ఆట్టేకాలం ఆక్రోశిస్తూ కూర్చోలేదు నేను. ఆస్యానూ నన్నూ విడదీయటంలో కర్మదేవత మంచిపనే చేసిందేమోనని కూడా ఒక్కోసారి అనుకున్నాను దానిలాంటి భార్యతో నేను సుఖపడేవాణ్ణికాదేమో లెమ్మని నన్ను నేను సమాశ్వాసించుకున్నాను. అప్పటికింకా చాలా చిన్నవాణ్ణి- క్షణికమైన భవిష్యత్తు అనంతంగా కనిపించినరోజులవ్వి. 'మళ్ళీ అలాగే సంభవించరాదా? ఈసారి అంతకంటే మంచిది- అంతకంటే సుందరతరమైంది-?' అనుకున్నాను. చాలామంది స్త్రీలతో ప్రవర్తించాను గాని ఆస్యా నాలో రేకెత్తించినభావం- తీవ్రమై అతి సున్నితమై అగాధమైన భావోద్రేకం మరెన్నడూ కలగలేదు నాకు. అంత ప్రేమపూరంగా అంతస్నిగ్ధంగా మరేనయనాలూ నన్ను నిలబెట్టలేదు. ఇంకెవరి హృదయం నా గుండెలమీద

విశ్రమించినా నా హృదయం అంత తియ్యని బాధతో, సుఖంతో కొట్టుకుపోలేను. ఒంటిగంటి బ్రహ్మచారినై ఏకాకినై ఎప్పటికీ అంతంకాని కాలాన్ని ఇలా వెళ్ళదోసుకొస్తున్నాను. ఒకనాడు ఆస్య నాకోసం మేడమీదనుంచి జెరేనియం పూలగుత్తి ఒకటి విసిరేసింది. శుష్కించిపోయిన ఆ పూగుత్తి ఆమెరాసిన చీట్లు మాత్రమే నాకు మిగిలిన పవిత్ర స్మృతి చిహ్నాలు. ఈనాటి కూడా ఆ పూలగుత్తి లీలగా సువాసన వేస్తూంటుంది. ఆ పూలు విసిరిన చేయి-ఒక్కసారిమాత్రమే నా పెదవుల కద్దుకొన గలిగిన ఆచేయి-ఎక్కడ ఏ సమాధిలో శిథిలమైపోతోందో...మరి నేను...? నేనేమయ్యాను? ఆనాటి ఆనందం ఉత్సాహం పరవళ్ళు తొక్కే ఆ ఆశలూ ఆశయాలూ-అన్నీ ఏమైపోయాయి? చివరికేం మిగిలింది? ఒక అనామకశుష్క పుష్పగుచ్ఛపు సురభిళం మానవుని సుఖదుఃఖాల్నీ ఆనంద విషాదాల్నీ అధిగమించి ఇంకా సజీవంగా వుంది...బహుశా ఆ మానవునికూడా అధిగమించి వుండగలదేమో...



